శ్రీమత్ప్రభాకరాయనమః

# భక్తతుకారాము

అనెడి

చరిత్రాత్మకమైన - యైదంకముల

## నాటకము

ఇయ్యాది మాడుగుల గ్రామనివాసులు, అష్టావధానులు, మదనమోహినీ, సఖీమిగ,
శృంగార శాకుంతల, ప్రమదాలస, శాకుంతలద్విపద, అమృతోదయము,
మొదలైన గ్రంథకర్తలు నగు బ్రహ్మశ్రీ

## త్యాడీ వేంకటశాస్త్రిగారిచే

రచియింపంబడి

కాకినాడ నివాసి, బుక్కు-సెల్లర్సు అండ్ పబ్లిషర్సు

## ఉసిరిక బంగారయ్య అండ్ సన్సు, చేఁ

ప్రకటింపంబడియె.

మొదటికూర్పు 1000 ప్రతులు.



కాకినాడ.

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే,
కాకినాడ ముద్రాక్షరశాలయందు
ముద్రింపంబడియె.

1925.



[వెల రూ 1—0—0

# ఉపోద్ఘాతము.

---

పాఠకమహాశయులారా! నేరచించిన గ్రంథంబులలో "సనే
మిర" నాటకమును ముద్రింపించి ప్రచురింపించు తరుణంబున, నేత
ద్గ్రామస్థులగు మన్మిత్రులు గొందఱిలో బ్రహ్మశ్రీ దర్భా సూర్యనా
రాయణగారును, మహారాజశ్రీ సింగంసెట్టి బాలకృష్ణరావుగారును,
ప్రసంగవశంబున "మీరొక కేవలభక్తిరసప్రధానంబైన నాటకమును
బహు మృదుశైలిలో రచింపుఁ" డని నన్ను మిక్కిలి ప్రేరేపించుచు
సమయోచితముగాఁ దన్మనంబుల నాకర్షించిన యీ "తుకారాము
చరిత్రమును" ప్రయత్నపూర్వకముగా సంగ్రహించి, ప్రస్తుతము నేనిట
నివసించుచున్న మచ్ఛ్వశుర నిలయంబున కొకనాఁటి రాత్రివచ్చి యీ
వచన గ్రంథంబు నాకొసంగి, యతిత్వరలో సంకల్పంబు నెరవేర్ప నభి
లషించినందున, మంచిదని యందులకంగీకరించి, రెండుదినంబులలో
నందలి కథావిధము నంతయు గ్రహించి, కేవలభక్తిరసప్రేరితుండనై
యత్యుత్తమ స్వభావులు మత్షడ్డకులు నగు బ్రహ్మశ్రీ పాఁడి కాళిదా
సుగారి యాలోచన ముఖ్యసహాయముగా స్వీకరించి 1924 వ సంవత్స
రము ఫిబ్రవరి నెలలోఁ బ్రారంభించి యానెల 18 వ తేదీ నాఁటికి
మత్సామర్థ్యానుసారముగా నీనాటకమును సంపూర్తిజేసిన పిదప, నా
యెడ నిర్హేతుకజనిత సంపూర్ణ దయాపరిపూరిత హృత్పుటులు, పరమ
మిత్రులు, భిషగ్వరులు, దుర్జన భయంకరులు నగు బ్రహ్మశ్రీ ఉపాధ్యా
యుల ఉమ్మన్నశాస్త్రిగారును, దత్ప్రేరక యుగ్మంబు నద్దానిం బఠించి,
యత్యానందమును బ్రదర్శింపుచు, మహారాజశ్రీ గుడివాడ సోమరాజు
గారు మొదలయిన మఱికొందఱు మిత్రుల సహితముగా, నాగ్రంథము
ను ప్రదర్శనాదులఁ బ్రకటింప నెంతయుఁ బ్రయత్నించిరిగాని, యందు
విధివిధాన ప్రతికూలమువలననో, మఱెందువలననో సంకల్పసిద్ధిగాక

యదియట్లు యుండఁగా, నంతకుఁ బూర్వమునుండియు నాతోఁ నిర్మల మైత్రి గలిగియున్న మహారాజశ్రీ ఉప్పిరిక బంగారయ్యగారు నేఁటికి నా వద్దకువచ్చి “ మీచే రచింపఁబడిన నాటకమెద్దియైన సిద్ధముగా నున్నచో నాకొసంగుదు రేని ముద్రింపించి యద్దానివలన నేను బాగుపడఁ దలంచియుంటి ” నని ప్రసంగించునంతఁ దద్వాత్సల్యప్రేరితుండనై యీ దిగువ నుదాహరింపఁబడిన తేదీ మొదలొక సంవత్సరమువఱకు, కాపీ రైటు హక్కు సహితముగాఁ గేవలపరమార్థ ప్రతిఫలాకాంక్షినై యిచ్చియుంటిని. మఱియు నాచరిత్రమునందలి కొన్ని యనామక పాత్రలు స్వకల్పిత నామయుక్తములుగా నిరూపకరచనయందుంచుట మొదలగు విషయములచేత గాని, యచ్చువలనఁ గాని యిందెవ్వియైన లోపంబులు జూపట్టిన మీరత్యంత సహనగుణ ప్రాధాన్యశీలురై దయతోఁ దెలిపెదరేని పునర్ముద్రణమునఁ దదనుకూలమగును.

గ్రంథకర్త

ప్రస్తుతము,
కాకినాడ.
20—4—1925.

అష్టావధాని.

---

72 వ పేజీలో 8 వ పంక్తి దిగువ నీగద్య పద్యము లుపయోగింప వలయును.

అదియుఁగాక ;

మ. అనఘద్ధేను పయస్స్ఫురీతి గ్రహణీయంబైన భూదేవ కృ
ద్ఘనమౌ కావ్యముగాక, శూద్రకవితల్ ♦ తద్గర్వితల్ దాఁచి చుం
డిన కౌశేయము జన్నిదాఁబును గడింపన్ నీచములౌనె? శూ
ద్రునకోచ్ఛిష్ట హవిర్విధంబునఁ గనన్ ♦ క్షోణీతలంబందునన్.

# ఈనాటకమునందువచ్చు పాత్రములు



1 సూత్రధారుఁడు.

2 నటి.

## 1 ప్రథమాంక ప్రథమరంగము—నివాస గృహము.

1 జిజీబాయి—తుకారాము భార్య.

2 కాశి, 3 గంగ, 4 భాగీరథి } తుకారాముని పుత్రికలు.

5 మహాదేవుఁడు, 6 విఠోబా } తుకారాము పుత్రులు.

7 తుకారాము—కథాముఖ్యభక్తుఁడు.

8 వర్తకులు—దేహూగ్రామ నివాసులు.

## 2 ప్రథమాంక ద్వితీయరంగము—మార్గమధ్యము.

1 సోమశర్మ—శృంఖలబద్ధ బ్రాహ్మణుఁడు.

2 కుముదిని—తత్కళత్రము.

3 రాముఁడు, 4 భీముఁడు } తద్రిక్తకథేయులు.

5 వర్తకులు—(ప్రథముఁడు, ద్వితీయుఁడు)

6 తుకారాము.

## 3 ద్వితీయాంక ప్రథమరంగము—నివాస గృహము.

1 జిజీబాయి.

2 తుకారాము.

3 విఠోబా.

4 భాగీరథి.

7 గంగ.

6 అప్పులవారు—(నలుగురు)

7 దామోదరుఁడు—తుకారాము సోదరుఁడు

8 వృద్ధాంగన—ఒక గృహిణి.

9 మాధవశర్మ—యాచకుఁడు.

10 అతిథులు—అభ్యాగతులు.

11 శ్రీహరి—దైవము.

## 4 తృతీయాంక ప్రథమరంగము—మార్గము.

1 గంగాధరపంతు, 2 సంభాజీ } తుకారాముశిష్యులు.

## 5 తృతీయాంక ద్వితీయరంగము. దేవాలయము.

1 తుకారాము.

2 మాంస్వాజి—సానను.

## 6 తృతీయాంక తృతీయరంగము—గృహము.

1 జిజీబాయి.

2 తుకారాము.

3 గంగాధరపంతు.

4 సంభాజీ.

5 భక్తులు—(ముగ్గురు)

6 దొంగలు—(ఇరువురు)

7 వృద్ధబ్రాహ్మణి—యాచకురాలు.

8 ఖండోబా—బీదబ్రాహ్మణుఁడు.

## 7 తృతీయాంక చతుర్థరంగము-వీధి.

1 ఖండోబా.

## 8 చతుర్థాంక ప్రథమరంగము—సభామందిరము.

1 రాజు } దేహూగ్రామాధిపతులు.
2 మంత్రి }

3 భటుఁడు—సేవకుఁడు.
4 రామేశ్వరభట్టు—మతాధిపతి.

## 9 చతుర్థాంక ద్వితీయరంగము—మార్గము.

1 తుకారాము.

## 10 చతుర్థాంక తృతీయరంగము—విశ్రాంతి భవనము.

1 రామేశ్వరభట్టు. 2 విశ్వేశ్వర సోమయాజి. 3 బ్రహ్మేశ్వరశాస్త్రి. 4 సోమేశ్వర సిద్ధాంతి. 5 నారాయణేశ్వరావధాని.—(దేహూగ్రామ బ్రాహ్మణసంఘము.)
6 తుకారాము.

## 11 చతుర్థాంక చతుర్థరంగము—ఇంద్రాణీనది.

1 తుకారాము.

## 12 చతుర్థాంక పంచమరంగము—ఉద్యానము.

1 రామేశ్వరభట్టు.
2 శిష్యులు—(ఇరువురు.)
3 పకీరు—మహమ్మదీయుఁడు.

## 13 పంచమాంక ప్రథమరంగము—గృహము.

1 తుకారాము
2 రామేశ్వరభట్టు.
3 శిష్యులు (ఇరువురు.)
4 మనోహరి—వేశ్య.
5 ఉద్యోగి—శివాజీప్రధాని
6 త్రిగుఁబోతులు—(నలువురు.)
7 శివాజీ—చక్రవర్తి.

## 14 పంచమాంక ద్వితీయరంగము—మార్గము.

1 శ్రీధరశర్మ. } మార్గస్థులు.
2 శంకరశర్మ. }

## 15 పంచమాంక తృతీయరంగము—గృహాంగణము.

1 తుకారాము.
2 సంభాజి.
3 గంగాధరపంతు.
4 రామదాసస్వామి—శివాజీగురువు.
5 శివాజి.
6 రామేశ్వరభట్టు.
7 మాస్వాజీ.





శ్రీమత్ప్రభాకరాయనమః.

# భక్తతుకారాము.



## నాంది.

శ్రీరాధాముఖభక్తహృత్కుముదస◆చ్ఛీతాంశుఁ డానందుఁ డా
భీరీచారుమనఃప్రమోదనక్రియో◆పేతుండు కృష్ణుండు స
త్కారుణ్యాదిలసద్గుణాలయుఁడు మా◆కాంతార్చితస్వోత్పదాం
భోరుడ్భక్తిసుధారసం బొసఁగుచుం◆ బ్రోచు న్మము న్నిత్యమున్.

[నాంద్యంతమున సూత్రధారి ప్రవేశించి]

(తనలో) ఈ సదస్యు లందఱు నేకకాలంబున నియ్యెడ కరుదెంచిన కారణం బెయ్యది? (ఆలోచించి) అర్ధాంగి యగుటచేత నవశ్య మీసందేహ నివారణము మత్కాంతవల్లనే కావలయును. (ప్రకాశముగా) ప్రేయసీ!

నటి—(ప్రవేశించి) నాథా! అనంతం బైన సాంసారిక క్రియామగ్న చిత్తనై యున్న నా కర్ణయుగ్మంబునకుఁ దమ మృదుతరాహ్వానాక్షరత్రయధ్వన్యనేకీకృతమేఘగంభీరఘోషణంబు భాతి వినిపించినంతనే కరంబునఁ గల యుపకరణంబు బట్టి విడిచి రానుంకించు నర్ధనిమిష కాలంబులో నది సజీవంబైనదై భూస్పర్శ లేకయే కోపాధికుని యాజ్ఞకు భయాత్ముఁడై మెలంగెడి పరి

జనునివిధంబున నిలిచి యుండె. ముందుగా నీవిచిత్రికారణముం దెల్పి పిమ్మట భవదాజ్ఞాకారణంబు ననుగ్రహింపఁ బ్రార్థితులు.

సూత్రి—(నవ్వుచు) సాధ్వీతిలకమా! పతిభక్తిపరాయణశీల వైన నీ ప్రభావమున కచేతనములు చేతనతుల్యంబు లేల కాకుండును? కేవల మది నీ పాతివ్రత్యమహిమావిశేషము. అట్టి నీ కిపుడు నేఁ బిలిచిన కారణంబును బ్రత్యేకము వక్కాణింపవలె నేమి?

నటి—(చెవుల మూసికొనుచు) హా! నాథా! కేవలము భవత్పదదాసి నగు న న్నిట్టి స్తుతిపాత్రిగా భావింపుచున్నా రేమి? ఇది ధర్మమా?

సూత్రి—(నవ్వుచు) కాంతారత్నమా! నీ వటుల భావింపవలదు. నిశ్చయముగా నీ సుగుణగణమే న న్నటులఁ బలుకఁ బ్రేరేపించినది.

నటి—ఏమో మీరెట్లు తలంచినను సరియే గాని నేనుమాత్రము మీ నిత్యసేవకావ్రతంబుకన్న నన్యం బెద్దియు నెఱుంగని దానను.

సూత్రి—కనుకనే నీ పతివ్రతామహిమ లోకమున కుద్బోధించుటకై యటులఁ బ్రత్యక్షముగాఁ బరిణమించుచున్నది.

నటి—అటులయిన నీ సభాజనులు మనచే నానందించుటకై యరుదెంచిన ట్లూహింపవలెనా యేమి?

సూత్రి—ప్రియసీ! నాయందించుక గౌరవార్థము నీ విట్లు పలికితివే గాని యీమహామహుల సంతసింపఁ జేయుటకు మన మేపాటివారము?

నటి—నాథా! అటులయినచో వారలే మనల నానందింపఁ జేయునేమి?

సూత్రి—నిస్సందేహముగా నీ సభాసదులే మనల నానందింపఁ జేయవలెను.

నటి—అది యెట్లు?

సూత్రి—ఇట్లు;

గీ. చిలుక పెంచెడువారలు ♦ చెప్పునట్టి
పలుకు లెల్లను బల్కుట ♦ పనిగనుండు
వాని వినువార లెల్లరు ♦ దానిఁ బ్రేమఁ
బట్టి దువ్వుచు ముద్దాడి ♦ వదలకుందురు. 2

నటి—నాథా! మీప్రసంగ మంతయుఁ గ్రియకు నాటకప్రదర్శనా యత్తచిత్తు లయినట్లు స్ఫురింపఁ జేయుచున్న దే.

సూత్ర—ప్రియురాలా! అది యంతయుఁ బ్రసంగవశంబున నట్లు కాకతాళీయన్యాయముగా సరిపడెను గాని యాలోచించినచో నీ వనిన ట్లదియే యిట్టి సమయంబునఁ గర్తవ్యము.

నటి—అది యెట్టి ప్రసిద్ధిగలది?

సూత్ర—రసప్రధానవిరాజమానం బయిన భక్తతుకారా మనెడి సుప్రసిద్ధనూతననాటక రాజము.

నటి—తత్కవి నామాదు లెయ్యవి?

సూత్ర—

సీ. శాండిల్య సద్గోత్ర ♦ సంభవ పట్టాభి
రామశాస్త్ర్యభిఖ్య ♦ రమ్యునకును
దత్సతి సీతాంబ ♦ తత సద్గుణస్తోమ
కును గనిష్ఠసుతుండు ♦ కోవిదుండు.
సుజను లామోదింపఁ ♦ గుజనులు ఖేదింపఁ
దగు విషయంబులఁ ♦ దనరుచున్న
యల "ససేమిర" నాట ♦ కాది గ్రంథంబుల
కర్త వేంకటశాస్త్రి ♦ కవి విరచిత

గీ. మైన "భక్తతుకారాము" ♦ ననెడి నాట
కమును నేఁడు ప్రదర్శింపఁ ♦ గనెడి విన్నెడి

సభికులెల్లరు నామోద ♦ జలధిఁ దేలి
మనలఁ దేలింపకుందురే ♦ మాన్యవిధుల. 3

నటి—మనోహరా! నామాటకుఁ గోపింపక మఱియొకటి నిశ్చయించిన బాగుండునేమో యని తోఁచుచున్నది.

సూత్ర—మనోహరీ! ఏ మట్లని యెదవు? సర్వజనులకు శాశ్వతసుఖానందకారణం బయిన మోక్షమార్గ ప్రదర్శియగు నిట్టి సద్గ్రంథంబుకన్న నర్హంబైన దన్యంబు గలదా?

నటి—నా యభిప్రాయ మందునుగూర్చి కాదు. భక్తికన్న నన్యరసంబులం దధికాభిలాషు లధికముగా నుందురేమో యని యటులంటిని.

సూత్ర—ఆ భేదం బీ ప్రదర్శనానంతమందు విమర్శింపఁ దగినది కాఁబట్టి నీ విఁక నంతస్సందర్భమున కేఁగుము.

నటి—తాముకూడ విచ్చేయుఁడు.

(ఉభయులు నిష్క్రమించెదరు.)

ఇది ప్రస్తావనము.



శ్రీమత్ప్రభాకరాయనమః.

# భక్తతుకారాము

## ప్రథమాంకము.



స్థలము—నివాసగృహము.

[కాశీ, భాగీరథి, గంగ యనెడి పుత్రికలు, మహాదేవుఁడు, విఠోబా యనెడికుమారులు, తల్లి జిజీబాయియుఁ గూర్చుండి పరివేశించెదరు.]

జిజీ—(తనలో) ఆహా! ప్రాణనాథుఁడు వాణిజ్య మొనర్చుచుండెనే గాని తన చిత్తచాంచల్యమును మాత్రము విడిచి సంచరించుచున్నట్లు తోఁచకున్నది. సంసారభారంబరయ ననంతంబైనది. ఇట్టి దీనిఁ గూర్చి కాంతుం డొక్కింతయైనం దలఁపకున్న నీభారవాహకమునకు స్త్రీమాత్రురాల నైన నే నేపాటిదానను? ఒకనాటి కొకనాఁడు మనోహరుఁడు తన విరాగమునే జూపుచుండెను గాని రవంతయుఁ గనికరంబు వహింపకుండెను. గూఁటియం దొంటరిగా విడిచి యన్యప్రదేశముల కేఁగెడి జననీజనకులఁ గానక యాఁకలిచే నలఁచుచుండెడి పిల్లపక్షులరీతిగా నావంశదీపకు లైన యీపిల్ల లన్నాతురులై యేడ్చుచుండుటయే గాని నాచెవులార విని యానందింపఁ దగిన ముద్దుపల్కులఁ బలుకనేరకుండిరి. ఆహా! నే నెట్లు సైఁపఁ గలను? నిరంతర మీ శిశురోదనం బెట్లు వినుచుండుదును? అయ్యో! వినక నే నేమి చేయుదును? అకటా! యిరుగుపొరుగులం గలపిల్లలెల్ల ముద్దుముచ్చటలతోడ, వస్త్రవాహనాదులతోడ, మఱియు ననేక సంపదలతోడ నిత్యము తులఁదూఁగుచుండ నాపిల్ల లన్నపానీయము

లకు సైత మెచ్చుచుండుటయూ ప్రాప్తించినది. (పిల్లలఁ జేర దీసి
కొని) హా! శివానీ! భవానీ!

సీ. పూర్వార్జితంబులౌ ♦ భూము లెల్ల నశించి
కూటికే కఱ వయ్యెఁ ♦ గూనలకును
యత్తమామలనాఁటి ♦ యాస్తి యంతయుఁ బోయి
బట్టలే లేవయ్యె ♦ బాలురకును
తాత లార్జించిన ♦ ధనము గతంబయి
పేదతనం బబ్బెఁ ♦ బిల్లలకును
స్వార్జిత మనిచెప్ప ♦ క్షామంబు ప్రాప్తించె
గతియేమి యింక నాదు ♦ కందువులకు

గీ. హా! మనోనాథ! యేమి సే♦యంగఁ దలఁచి
నారలో గాని యేదియు ♦ నాకుఁ దెలియఁ
జాలకున్నది, ఋణబాధ ♦ జాలఁ గలదు
నోరు తెలియని పిల్లల ♦ దారి యెద్ది?. 4

గంగ—అమ్మా! విచారించుచుంటి వేమి?
జిజీ—అయ్యో! కూఁతురా! నీ కేమి చెప్పుదును.
భాగీ—అమ్మా! నాన్న నా కరఁటిపండ్లు దెచ్చిపెట్టునా?
జిజీ—అయ్యో! తల్లీ! మీనాన్న కట్టివిచారము లేకయే నా కీవిచా
రము ప్రాప్తించి నిత్య మిట్లు కుందింపఁ జేయుచున్నది.
కాశి—భాగీరథీ! నాన్న నాకు మంచిబట్టలను దెచ్చిపెట్టును.
జిజీ—హా! భవానీ! న న్నెంత నిర్భాగ్యం జేసితివమ్మా!

గీ. ధనము గోరిన సంతాన ♦ తాపములను
బిల్లలను గోర నైశ్వర్య♦పీడనములఁ
గలుగఁ జేయుచు నిత్యదుః♦ఖముల ముంచి
కష్టపెట్టంగఁ దలఁచితే ♦ కరుణమాలి. 5

విశో—అమ్మా! ఏష్పుచుంటివేమి? నా కాఁకలివేయుచున్నది బువ్వ పెట్టుము.

జిజీ—అయ్యో! తండ్రీ! మన మడవిలో మృగజాతిగానైనఁ బుట్టినచో మీ యాఁకలివేళకు నన్నైనఁ దిని ప్రాణముల నిలువఁ బెట్టికొందురు గదా!

మహా—అమ్మా! తల దురద వేయుచున్నది దువ్వి పెట్టుము.

జిజీ—బాబూ! దువ్వెనకై యిరుగుపొరుగువారల నెన్ని పర్యాయములు వెర వడుగఁ గలను? ఇటు రమ్ము! (చేతితో దువ్వును).

గంగ—అమ్మా! నాయొడ లంతయు మన్ను పట్టి చీకాకుగా నున్నది. స్నానము జేయింపుము.

జిజీ—అయ్యో! వెఱ్ఱితల్లీ! నీరుమాత్రము మన యింట నుంచుకొనఁదగిన పాత్రి లెక్కడివి? అయ్యో! మీముద్దుముచ్చటలకైనఁ జాలనట్టి యీ నిర్భాగ్యగర్భంబున మీ రేలపుట్టితిరమ్మా! (విచారముతో)

గీ. కుడువఁగాఁ దగువస్తువుల్ ♦ గూడనట్టి
కట్టఁ దగినట్టి బట్టలు ♦ గలుగనట్టి
తాల్పఁదగినట్టి నగలతోఁ ♦ దనరనట్టి
బ్రతు కదేటికి ధారుణీ♦భరము గాని. 6

విశో—అమ్మా! నా కేమియుఁ బెట్టవద్దు గాని నీవుమాత్రము మాటిమాటి కేడువకుము.

జిజీ—నాయేడుపు వినలేకుంటివా నాయనా? నీకుఁ గలిగెడి యీశనికర మా భవానికిఁ గలిగిన మనకీదైన్యంబు లేకుండును గదా! (ఆలోచించి) హా! పయోనిధీ! నీవెంతయో దయతో బడబానలం బుద్రేకించు నేని జగంబుల నెల్ల నిర్మూలించునని దానిఁ జల్లార్చుచుంటివి గాని యనేకజనమనఃపీడాకరం బైన యీతామ

రూపంబునుమాత్ర మడఁగింపకుంటివిగదా ! హా ! భవానీ !
నీ కేమిన్యాయము గలదు.

చ. గురుతరసాధుజీవు లగు ♦ గొఱ్ఱెల మేఁకల గావు గొంచు, భీ
కరములు వ్యాఘ్రసింహములఁ ♦ గాంచక భీతి మెలంగునట్లు, సా
దరమున నర్థవంతుల ము♦దంబునఁ బ్రోవుచు దీనకోటినే
బరువడి క్రోధదృష్టిఁగని ♦ వంచనఁ జేయుచు నుందు వయ్యయో. 7

విఠో—అమ్మా! నీయేడుపును విడువవు. నాయాఁకలియుఁదీరదాయెను.

జిజీ—అయ్యో! ముద్దులపట్టీ! (కౌఁగిలించికొని దుఃఖముతో) నేనేమి
పెట్టి నీ యాఁకలిఁ దీర్పఁగలను ?

సీ. ధాన్యరాశులు బోయి ♦ ధనమెల్లఁ గోల్పోయి
నిఱుపేదతనముతో ♦ నిండియుంటి
భూషణంబులు బోయి ♦ పుట్టంబులును బోయి
శిథిలవస్త్రముతోడఁ ♦ జెలఁగుచుంటిఁ
బానపాత్రలు బోయి ♦ వంటపాత్రలు బోయి
కష్టదినంబులఁ ♦ గడపుచుంటి
పరమాన్నములు బోయి ♦ భక్ష్యముల్ దూరమై
యుపవాసములతోడ ♦ నోర్చుచుంటిఁ

గీ. గడుపు నిల్వదు మిముఁజూడఁ ♦ గొడుకులార !
ప్రాణములు మేనిలో నుండి ♦ పాయవయ్యొఁ
దండ్రి మీబాధ లించుక ♦ తలఁపకుండె
నేమిసేయుదు నయ్యయో ♦ యిపుడు నేను. 8

విఠో—అమ్మా! నీ వేడ్చుచుంటివే గాని నా యాఁకలి యించుకయుఁ
దగ్గదాయెను. మంచినీళ్లనైనఁ దాగి వచ్చెదను.

జిజీ—(దుఃఖముతో) ఎంతగతి ప్రాప్తించెను నాయనా! వెళ్లిరమ్ము.
లోఁతునీళ్లకు మాత్ర మేఁగవలదు సుమా.

విరో—అమ్మా! నాకు మాత్రము భయము లేదనుకొంటివి కాఁబోలు. నీతోఁగలసి వచ్చునప్పుడైన నటుల వెళ్లియుంటినా?

జజీ—కుమారా! వెళ్లకున్నప్పటికి నీవొక్కఁడవు మాత్ర మేఁగవలదు. అక్కయు నీవుం గలసి వెళ్లిరండు. అమ్మా! కాశీ! తమ్మునిఁ దోడ్కొని నదికేఁగి దాహముదీర్చికొని త్వరగా రండు.

కాశి—తమ్ముఁడా! వెళ్లివచ్చెదము రమ్ము. (ఇద్దఱు నిష్క్రమించెదరు)

జజీ—అకటా! తొలి జన్మములో నే నెట్టి ఘోరపాపంబులొనర్చి వాని ననుభవించుట కీజన్మ మొందియుంటినో గాని గాఢాంధకారం బుతోఁ గూడిన యర్ధరాత్రియందైనఁ బిల్లలుగాని నేఁగాని దాహశాంతికొఱకు సైతము మాటిమాటి కానదికే యేఁగవల సివచ్చెఁ గానిజలముదాఁచుకొనఁదగిన దొక మృత్పాత్రియు నింట లేకపోయెఁగదా! హా! దైవసంఘటనమెంత విచిత్రముగానున్నది.

గీ. అనుభవము లేక ధర్మ మింతైన లేక
పరుల యాపద కుపకార ♦ సరణి లేక
వంశమేనియు లేకయే ♦ వఱలు లోభి
జనులపైఁ గాదె నీప్రేమ ♦ జలజనయన. 9

ఓ పద్మాలయా! వెట్టిదాన వైనీవేమి తలంచుకొని యామహాలుబ్ధాదిదుర్జ నులనాశ్రయించుచుంటివోగాని యదినీకేమిశాశ్వతము? విమర్శింతువేని,

ఉ. ఎచ్చట నీవు గల్గియును ♦ నీశ్వరతృప్తిగ ధర్మకర్మలో
నిచ్చమెలంగకున్న నవ♦నీధవు చెంతకుఁ జేరుదానవో
తుచ్ఛులచేతఁ జిక్కుదువొ ♦ ముఖ్యముగా నలయుగ్ని దగ్ధవై
నొచ్చెదవోగదే హరి మనోహరమార్గము మాఱునట్లుగా. 10

[illegible] లేన
[illegible]
టానురాగము గలదానవనియుఁ జెప్పఁదగును.

[కాశీ విఠోబా లిరువురు ప్రవేశించెదరు.]

జిజీ—(కుమారునిఁ గౌఁగిలించికొని) ముద్దులపట్టీ! క్షుత్పిపాసలు రెండును దీరునట్టుగా జలంబును గ్రోలితివి కదా!

విఠో—అమ్మా! కడుపు నిండునట్లుత్రావితి, నిఁక నా కాఁకలియులేదు.

[తుకారాము ప్రవేశించును.]

భాగీ—(కౌఁగిలించుకొని) నాన్నా! నాకొఱకరఁటిపండ్లుదెచ్చి పెట్టితివా?

కాశి—(చెంతకేఁగి) నాన్నా! నానిమిత్తము బట్టలు తెచ్చిపెట్టితివా?

తుకా—(తనలో) ఆహా! నిరుపమానసంసారమహాపాశబద్ధుం డగు పురుషుం డరయ వనాంతరలతికావృతపాదపంబుభాతి స్వేచ్ఛావిహీనుండై పుండరీకాక్షుని పాదారవింద భజనానందమరంగము గ్రోలుచుండ ననువుపడదు గదా!

జిజీ—నాథా! యుల్లంబును జల్లజేయు పిల్లల సల్లాపముల నాలించి ప్రత్యుత్తరంబైన నొసంగకుండి రేమి? మౌనంబు నంత కఠినంబు జేయఁ బాడియా?

తుకా—తరుణీ! సంసారభారమంతయు నిరంతరము భరించుచున్న నీవు చెంతనుండఁగాఁ బిల్లల యజ్ఞానోక్తులకు నే నేమి యుత్తరం బివ్వవలెను? సేవాసక్తిత్రో నే నా శ్రీహరి మందిరంబునకే గదా వెళ్లి వచ్చియుంటిని.

జిజీ—ప్రాణబాంధవా! మీ రా సేవాసక్తిత్రోడనే కాలమంతయుఁ గడుపఁ దలంతు రేని మన యాపదలు బాయు టెట్లు? పసిపిల్లల ముద్దుముచ్చటలనైన భావింపవలదా? కనికరం బించుకయు లేని మీ కఠినచిత్తమును బాలురచెంతనా చూపఁదలంచితిరి? అయ్యయో! ఇది యెక్కడి ధర్మము?

తుకా—(నవ్వుచు) ప్రియురాలా! సంసారమహార్ణవమగ్నచిత్తవృత్తి గలదాన వై యోజింపక నీవటు లడుగుచుంటివేగాని ధర్మముల

లోనెల్ల నుత్తమధర్మమిదియే యని నిర్మలబుద్ధితో గ్రహింపుము.

సీ. విధివిరామము లేని ♦ విపదబ్ధి దాటించు
భక్తి గల్గిన దేవ ♦ భజన గాదె?
యసహాయభీతాత్మ ♦ నాదరింపఁగఁ జాలు
శ్రీహరి పదపద్మ ♦ చింత గాదె?
దురితసంచయ మెల్లఁ ♦ ద్రోసి సంరక్షించు
మహనీయమా హరి ♦ స్మరణ గాదె?
సారవిహీనసం♦సార బాధలఁ గావ
నంబుజాతాక్షు ధ్యా♦నంబు గాదె?

గీ. హీనగుణధామ మైన య♦జ్ఞానగాఢ
తిమిరమును బాప సద్గుణో♦దీర్ణ మైన
జలజబాంధవకిరణసం♦చయము గాక
యన్య మెయ్యది గలదె యో ♦ యబ్జవదన. 11

జిజీ—మీ యభిప్రాయము మాత్ర మటులున్నది గాని యది మా
యనుభవంబునఁ గానరాకున్నది.

తుకా—అట్టి భగవంతుని యనంతచింత నిశ్చలస్వాంతమునఁ జేయు
పుణ్యాత్ములకలవడని భాగ్యంబు లెవ్వరియెడనైనఁగానవచ్చెనా?

సీ. జనకనిర్మితకష్ట♦సంచయంబుల దాఁటి
ప్రహ్లాదుఁ డాహ్లాద ♦ పదవి గనఁడె?
దారిద్ర్యసంతాన♦ఘోరాగ్నివనముల
మున్గి కుచేలుండు ♦ ముదము గనఁడె?
ధర్మకింకరబాధఁ ♦ దవిలి మార్కండేయుఁ
డతిసంతసము గల్గు ♦ గతిని గనఁడె?
మోహినివలన ని♦ర్మోహాత్ముఁ డైన రు
క్మాంగదుఁ డానంద ♦ మహిమ గనఁడె?

గీ. పరమసుజ్ఞాన యుతమైన ♦ భక్తిగాదె
వారి నారీతి నానంద ♦ వనధిఁ దేల్చె
నన్ని మార్గంబులను జూడ ♦ నబ్జనాభు
పాదభక్తికి సాటి యి♦వ్వసుధఁ గలదె?

జిజీ—ప్రాణేశ్వరా! మీ రేవేవియో యన్నియు నప్రస్తుత విషయములను గూర్చియే చర్విత చర్వణముగాఁ బలుకుచుండిరి గాని లోకాచారము ననుసరించి యీసంసార సౌఖ్యమును బొందఁ దగిన మార్గము నాలోచింపకుండిరి గదా!

తుకా—(నవ్వుచు) ప్రియురాలా! అజ్ఞానముచేతఁ గప్పఁబడిన చిత్తము గలదానవై యశాశ్వతమైన యీతుచ్ఛ సంసార సౌఖ్యమునకై సామాన్య లోకాచార మనుసరింపుమనుచుంటివే గాని యందలి సత్యము నెఱుఁగనిదానవైతివి గదా! నిశ్చలాత్మతో నాయుపదేశ విషయంబుల నాలించినదానవైన మాటి మాటికీ ప్రసంగమును జేయకుందువు.

సీ. సంసార సౌఖ్యముల్ ♦ స్వాంతమందునఁ గోరి
పరుల కొంపలఁ దీయు ♦ పాపబుద్ధి
క్షణకాల తృప్తికై ♦ సాహసంబు నహించి
యన్యకాంతలపైని ♦ యల్పబుద్ధి
తుచ్ఛసంతోషమం ♦ దిచ్ఛతోఁ దనరి యా
సవపానక్రియలతోఁ ♦ గవయుబుద్ధి
ధనలోభులౌచు సో♦దరినైన వంచింపఁ
గనకంబు హరియించు ♦ కల్లుబుద్ధి

గీ. గలిగి శాశ్వత జీవియై ♦ గ్రాలఁగలఁడె?
చిత్రగుప్తుని చేవ్రాఁతఁ ♦ జెరుపఁగలఁడె?
దండధరు నాతిథేయంబు ♦ దప్పఁగలఁడె?
తనదు కర్మఫలంబును ♦ దాటఁగలఁడె?

జిజీ—నాథా! మీ కావైరాగ్యమునం దెట్టి విశ్వాసముగలదో గాని లోకోక్తిని బట్టియు మన యనుభవావస్థలంబట్టియు నిజముగా నాపాండురంగండే యింతకుం గర్తయయ్యెననుట కించుకయు సందేహింపఁబనిలేదు. కాదేని,

గీ. చిల్లరసామగ్రి ♦ యెల్ల నమ్మెడి వేళ
నతఁడేమి యొసఁగె మీ ♦ కాప్తుఁడౌచుఁ
బితార్జితంబైన ♦ పెను వర్తకమునందు
నతఁడేమి యొసఁగె మీ ♦ కాప్తుఁడౌచుఁ
బల్లెలందున ధాన్య ♦ వాణిజ్యమొనరింప
నతఁడేమి యొసఁగె మీ ♦ కాప్తుఁడౌచు
మిరియంపు వ్యవహార ♦ గరిమనుండెడు తఱి
నతఁడేమి యొసఁగె మీ ♦ కాప్తుఁడౌచు

గీ. మార్గమున మీరు గొన్నట్టి ♦ మంచివనెడి
నమ్మకముగల్గు కపటపు ♦ నగలకైన
నతఁ డొసంగిన దేమి మీ ♦ కాప్తుఁడౌచు
నింక నొసఁగఁగనున్న ద ♦ దేమి గలదొ? 14

తుకా—(నవ్వుచు) కాంతామణీ? భేదబుద్ధివల్ల నీకవి యన్నియు నెట్టి విపరీతములుగాఁ దోఁచినప్పటికి గతముం దలంపరాదు. మఱియు వంశానుక్రమాగతంబయిన యీ విష్ణుభక్తియనెడి మహాపదవిని విడువుమని నీముఖ్యాశయమైనప్పటికి నది కేవల మైహికధర్మము. ఆ యవాఙ్మానసగోచరుండైన పుండరీకాక్షుం డొసంగునదియునైహికులకగోచరముగానే యుండును. కాఁబట్టి నీవిఁకనైన నామనఃక్లేశమునుండివిముక్తురాలవై యరవిందాక్షుని నిత్యధ్యానానందంబు గలిగి మెలంగుటయే శ్రేయస్కరము.

జిజీ—ప్రాణేశ్వరా! అటులయిన నాప్రార్థనంబంతయు వ్యర్థంబొనర్చి

నిశ్చయముగా మీరూహించునదేమి ?

తుకా—ఏమియూహించుటకైనఁ దగిన కర్తను నేఁగాను. సకలలోకాధీశ్వరుండై, సర్వక్రియాధారుండై, సర్వాంతస్సంచారుండైన శ్రీమన్నారాయణుం డొనర్పుమని యాజ్ఞాపించెడి కర్మలనెల్ల నాచరించుచుండెడి భృత్యుఁడను. మఱియు నామమాహాత్మ్యని నిత్యభజనయే యైహికాముష్మికములని త్రిశుద్ధిగా నమ్మి ప్రవర్తించువాఁడను. తదన్యంబెల్ల నశాశ్వతాసౌఖ్యం బగునదగుటచేఁ దృణప్రాయంబుగాఁ బరిగణించువాఁడను.

జిజీ—జీవితేశ్వరా! సకలైశ్వర్యప్రదాయినిఁగా నాజనకవంశస్థులచే సేవింపఁ బడుచున్న భవానీసేవయే మీరుగూడ నాచరించినఁదప్పేమి?

తుకా—(సంతోషముతో) ప్రియురాలా! దైవభక్తిలోఁ దప్పేమియు లేదుగాని నాసప్తమపితామహుఁడైన "విశ్వంభరు" నకు స్వప్నగతుండై పలికినవిధంబుగా లభించి యామామిడితోఁట యందుఁబ్రతిష్ఠింపఁబడి తద్విలాసరూపంబైన "విఠోబా" సమాఖ్యతోఁ బరఁగుచున్న యావిష్ణుభక్తి నాకన్న ముందు జనించిన దగుటవల్లను, నే గర్భస్థుఁడనై యున్నతఱి నాతల్లి "కనకాబాయి" నిత్య మా శ్రీహరి ధ్యానంబుతోఁ గాలము గడపుచు ననుఁ గనుటవల్లను, నాతండ్రియగు "బోల్హోబా"కు సైతమా సద్భక్తియే గలిగియుండుట వల్లను, వంశానుక్రమాగతంబైన యా సన్మార్గమునే నేనుగూడఁ ద్రిశుద్ధాత్ముఁడనై యవలంబించి యుంటిని. అదియుఁగాక మఱియొక విశేషం బాకర్ణింపుము.

గీ. ఆకసమునుండి పడు జలం ♦ బఖిలగతుల
సాగరమునందుఁ జేరెడు ♦ సరణిగాను
సర్వదేవ నమస్కృతుల్ ♦ జలజనాభు
సన్నిధినిగూర్చి చేరఁగాఁ ♦ జనును గాదె. 15

కాఁబట్టి యట్టి శ్రుతిప్రమాణభావమునుబట్టియు నన్నిరూపంబులఁ బ్రకాశించుచున్న శ్రీహరిసేవయే సర్వజన కర్తవ్యముగా నెఱుంగుము.

జిజీ—నాథా! మీపలుకుల నెంతశ్రద్ధతో వినుచుండినను బిల్లల నిత్య దైన్యస్థితిని గాంచుచున్న దాననౌటచేత నాకుఁగూడ మీయందట నిశ్చలభక్తి గలుగకున్నది. కాఁబట్టి యేపుణ్యాత్ములనో బట్టి యాభవానీకరుణవల్లను గొంత పైకముం దెచ్చి యిచ్చెద. దానితోనైన మఱల నొక వర్తక మారంభించి ధన సంపాదనమును జేసినఁగాని పసిపిల్లల బాధలఁ గనుచుండుట దుస్సహముగా నున్నది.

తుకా—మంచి దటులనే జేసెదను.

జిజీ—అయిన నేవెళ్ళి వచ్చెదను. (నిష్క్రమించును.)

[వర్తకు లిరువురు ప్రవేశించెదరు.]

తుకా—అయ్యా! మీరటఁ గూర్చుండి వచ్చిన కారణమును దెల్పుఁడు.

వర్త—(కూర్చుండి యందుఁ బ్రథముఁడు లేచి) అయ్యా! తుకారామా! నానాఁటికి మీకుఁ గలిగిన యీ దైన్యదశను గూర్చి మే మెల్లర మెంతయో విచారపీడితులమై యిప్పటికైన మా మాట లొక్కించక పాటింతువనెడి విశ్వాసముతో వచ్చితిమి. కనుక వర్తకానుభవజ్ఞానముతో మేము చేసెడిహితోపదేశమును గమనింపుము.

తుకా—అయ్యా! వచింపుము.

ద్వితీ—విశ్వసించెదనని ముందుగా నంగీకరించి వచింప మనుము.

తుకా—అయ్యా! సందేహ మక్కఱలేదు వచింపుఁడు.

ప్రథ—అటులయిన వినుము.

సీ. వర్తకంబున కాది♦వర్తన నిర్దయ
దయరీతిఁ జూపుచుఁ ♦ దనరవలయు

నత్యంతమిత్రుల ♦ నైన శత్రుల మాడ్కి-
నరయుచు సరకుల ♦ నమ్మవలయు
శత్రులతో నైన ♦ మిత్రతఁ జూపుచు
వస్తువుల్ గొనుచోట ♦ వఱలవలయు
నడుగువారికిఁ జూప ♦ నసలుకు రెట్టింపు
పద్దుల వ్రాసి చూ♦పంగవలయు
గీ. నల్పమనకయె తృణమేని ♦ యధిక మనెడి
చిత్తశుద్ధిని ధనము నా♦ర్జింపవలయు
నతిశయంబును విడనాడి ♦ యఖిలవస్తు
భరము నెత్తిని మోయుచుఁ ♦ దిరుగవలయు. 16

ద్వితీ—గీ. అరువు లరయక యిచ్చిన ♦ నసలు చెడును
సంతయును రొక్క-మే యమ్ము♦టనఁగఁ దగదు
యదియు రాఁబట్టు టాలస్య ♦ మైన యెడల
నడ్డిదెబ్బలు పోవుట ♦ వచ్చు సుమ్ము. 17

ప్రథ—

ఉ. పాపము పుణ్యమంచుఁ దన ♦ భావములోపల నెప్పు డెంచకే
బాపతు వస్తువైనఁ గొను♦వారలు నమ్మఁగ హెచ్చు మూల్యమున్
జూపుచుఁ దాఁ బ్రమాణమును♦సూక్ష్మతఁ జేయుచు స్వల్పమాత్రమున్
గోపముతోడ శాంతమును♦గూర్చుచు ద్రవ్యముఁ గూర్పఁగావలెన్ 18

తుకా—(తనలో) ఓహో! దుర్గుణము లెల్ల నత్యంతైకమత్యముతో నీమూఢులం జేరి యెట్లు ప్రేరించుచుండెనో! ఛీ ఛీ ధనమే శాశ్వతమని తలంచి పాపమువలనఁ గలుగఁగల బాధలఁ బరికింపకుండిరి.

ద్వితీ—

సీ. వర్తకాదుల మంచి ♦ వదలిన వారలే
మేడలతోఁ గూడి ♦ మెలఁగుచుండి

గవ్వైన గొప్పగా ♦ గణియించు వారలే
భూషణంబులు గల్గి ♦ మురియుచుండ్రి
దానధర్మంబులఁ ♦ దలఁపని వారలే
మేలుభక్ష్యంబుల ♦ మెసవుచుండి
రుపకారమును జేసి ♦ యుండని వారలే
పట్టుపుట్టంబులఁ ♦ గట్టుచుండ్రి
గీ. సాధుబాధల నిత్యము ♦ సలుపువారె
వంశవృద్ధిని గల్గుచు ♦ వఱలుచుండ్రి
పరులశ్రేయస్సు గనలేక ♦ పరఁగువారె
వైభవోపేతు లౌచును ♦ వసుధనుండ్రి. 19

తుకా—(తనలో) ప్రపంచమునఁగలదూష్యంబులెల్ల నీవంచకుల కిపుడు మంచిగాఁ దోఁచుచుండె. వీని ఫలితంబులన్నియు నంతంబున నాదండధరుని కతిథులయి యనుభవింపకుందురా?

ప్రథ—అయ్యా! మఱియొక విశేషమును గ్రహింపుము ధనార్జన కష్టంబిసుమంతయు నెఱుంగనివారెన్నఁడేని పిత్రార్జితధనంబు నైనను రవంతయుఁ గర్చుపెట్టంజనదు. ఏమంటివేని సమగ్రముగా నార్జింపఁ గలిగినవాఁడు మాత్రము మితిమీఱి వ్యయింపఁజాలఁడు.

ద్వితీ—అయ్యా! నీవు కోపపడినను సరియేగాని నిజమాలోచించిన యెడల నీవన్నియు నిరర్థకవినియోగము లొనర్చియే యీయవస్థకువచ్చితివి. వర్తకరూపకముగా నొకడబ్బు సంపాదించినవాఁ డెవఁడైన నీవలె నింతచాదస్తపుఁ గర్చుపెట్టి చెడినవాని నొక్కనినైన నేఁడు వేలుమడఁచి వచింపుము? దానధర్మములు, భూతదయయు లేనివారెవరు? ఏదియో సమయమునుబట్టి యొక తృణమాత్రముతో ధర్మమైనదనిపించికొను చుండవలెనుగాని

యదియే పిచ్చిగా నీవలె సర్వశూన్యుండైన నేమిలాభము ?

తుకా—(నవ్వుచు) మిత్రులారా ! మీరనఁదలంచి యిట్లనుచుండిరే గాని నాయందుమాత్రమేమిలోపములున్నవి? సర్వమునకాపుం డరీకాక్షుండే కర్తయై నడపుచుండెను.

ప్రథ—అదేమిమాటయ్యా ! తెలివిగలిగి గడుసుఁదనముతోఁ బ్రవర్తింపవలెనుగాని యీపాండురంగండే గలండని వడ్డించినపదార్థము భుజింపకుండిన నతఁడు నోటిలోఁ బెట్టిమ్రింగించునా?

జిజీ—(ప్రవేశించి) నాథా! మనయందభిమానముగల తోటివర్తకులు గూడ మనభాగ్యవశంబున వచ్చియుండిరి. నేఁగూడ నొకపుణ్యురాలినడిగి రెండువందల రూప్యములఁ దెచ్చియుంటిని. ఇవిపట్టుకొని యీపుణ్యాత్ములతోఁగూడితగినటులవ్యవహరించి సంసారము నుద్ధరింపఁ దగిన ధనమార్జించుకొనిరండు. పిల్లలయందుఁ గనికరము గలిగి మెలంగఁ బ్రార్థితులు. (రూప్యములిచ్చును).

తుకా—(రూప్యములఁ బుచ్చికొని) ప్రియురాలా ! భగవదనుజ్ఞానుసారమొనర్చువాఁడను. (వర్తకులతో నిష్క్రమించును.)

జిజీ—కటకటా ! ఎన్నివిధముల బోధించి ప్రార్థించినను నాథుండిప్పటికైన "భగవదనుజ్ఞానుసారమొనర్చువాఁడ" ననియే చెప్పి వెళ్ళి యున్నందునఁ గన్నపిల్లలయందభిమానముతో సంసారమునుద్ధరించునని తోఁచదు. హా! నాజనకవంశారాధితభవానికైన నాయందనుగ్రహము పరిణమించకపోవునని కలనైనఁ దలఁచియుండనైతిని. హా ! సకలాభీష్టప్రదాయినీ ! భవానీ !

ఉ. పేఁదనునైన నాచిఱుతబాలురఁ బెంచుద మన్న నీరమున్
జాలనిదాననై బహుకృశత్వమునొందిన దేహినైతి, హా !
జాలిరొకింత నాపయిని సత్వరఁ జూపకయుందువేని, యే
లీఁగ హిఁతుఁ గావఁగవలె స్వన రదఁ కశత్రూ! యుఁకన్. 20

విశో—అమ్మా! నాన్నయింటివద్దనైన నుండక మఱల నెచటికేఁగెను?

జిజీ—ముద్దులపట్టీ! మి మ్ముద్ధరింపఁగల ధన మార్జించుకొని రానేఁగిరి.

కాశి—అమ్మా! ఇప్పుడైన నాన్న నాకు బట్టలఁ దెచ్చిపెట్టి గాగరా
లను గుట్టించునా?

జిజీ—(విచారముతో) అయ్యో పిల్లలారా!

సీ. మూన్నాళ్ళకేని మీ ♦ ముచ్చటల్ దీరఁగాఁ
బ్రియమైన యన్నంబుఁ ♦ బెట్టనైతిఁ
దలదువ్వి జడవేయఁ ♦ దైల మించుక లేక
కనులారఁ జూడని ♦ కఠిననైతి
గాగరాలకు మాఱు ♦ కౌపీనముల నిచ్చి
తాల్పించుచున్నట్టి ♦ దైన్యనైతి
బొట్టు కాటుక లేక ♦ పోఁడిమి నెడబాసి
తిరుగఁ జూచెడి యన్య ♦ తరుణి నైతి

గీ. జలకమాడించి తడియొత్త ♦ వలువ లేక
యెడలో నిల్వఁ బెట్టుదు ♦ గుండె గట్టి
చేసికొని పట్టెదాననై ♦ చెలఁగుచుంటి
వచ్చి దయఁ జూడవేల? భ♦వాని! మమ్ము. 21

హా! పరమేశ్వరీ! నీ పరిపూర్ణకరుణం జూపి మ మ్మీ విపత్సముద్రము నుండి యెప్పటికి దాఁటించెదవో తెలియఁ జాలని నేనేమి సేయుదాన? నాతోటిపాటుగా నీ పసిపిల్లలకుఁగూడ నింతకాల మీ యిడుములఁ గుడుపుచుందువు? అయ్యో! నా వెట్టి పిల్లలారా! మీపూర్వజన్మంబున నెట్టి కర్మం బొనర్చి యీ పాపిష్టి గర్భంబునఁ బుట్టితిరో గాని మీ వెతల నే నెంతని సహింతును? నా కీవెతల నెవరు తీర్చెదరు?

గంగ—అమ్మా! మాటిమాటికి నీ వేడ్చుచుంటి వెందులకు?

మహా—అమ్మా! అంతసేపటినుండియు నేవేవియో తలంచుకొని

యేమ్పునంటివే గాని నాతల దువ్వవైతివిగదా! (గోకుకొనును.)

జిజీ—నాయనా! లోపలఁ గూర్చుండి దువ్వెద నందఱును రండు.

అందఱు—(లోని కేఁగుదురు. తెరజారును.)



ద్వితీయరంగము—మార్గమధ్యము.



[శృంఖలబద్ధుండైన సోమశర్మ యుతని సతి కుముదినియు నిరువురు
కింకరులతోఁ బ్రవేశించెదరు.]

సోమ—

సీ. దేవదేవ! రమేశ! ♦ దీనమందార! నన్
గావఁగాఁ జూడవే ♦ కరుణతోడఁ
బంకేజదళనేత్ర ♦ భర్మనిర్మితవస్త్ర!
పాలింపవే నన్ను ♦ జాలితోడ
లోకేశ! దశవేష ♦ నాకేశపూజిత!
వేగ నన్బ్రోవవే ♦ ప్రేమతోడ
విమలచారిత్ర! గో♦విందా! మురాంతక!
దరి నన్నుఁ జేర్పు మా♦దరణతోడ
గీ. శిష్టజనవంద్య! నన్ను ర♦క్షింపరావె!
భక్తపరిపాల! నన్నుఁ గా♦పాడరావె!
సాధుజనలోల! వేగ నన్ ♦ సాఁకరావె!
శ్రీసతీనాథ! నన్నుఁ బో♦షింపరావె!

భీము—అయ్యా! సోమశర్మగారూ! మీరెంత దైవప్రార్థనం బొనర్చుచుండినను ఋణము తీఱకున్నది. కాలము తఱుగుచున్నది. మీ కీశిక్ష విధించి పండ్రెండు వర్షములయినది గాని ప్రయోజనము మాత్రమింతయు లేకపోవుచుండెను,

రాము.—ప్రయోజనమే యుండిన సింకెంత ప్రార్థింతునో! త్రోవజరుగుటకేదియో కాలక్షేప మాచున్నది కానిమ్ము మనవంతు వినుచుందము.

సోమ—ఓయీ! యెద్దియేని యాధారము గలవారికైన జగదాధారుఁడగు పరమేశ్వరారాధనము ముఖ్యమై యుండ నిరాధారుండనగు నేను మాత్ర మెవరి నారాధించెదను? కష్టసుఖంబులు కేవలము పూర్వజన్మార్జితంబు లయినను జీవికాధారంబు లొసఁగువాఁడు మాత్ర మా భగవంతుఁడేగదా! అట్టి జగత్కర్త యగు భగవత్సేవయే మన కన్నివిధంబుల ముఖ్యాచరణీయము.

భీము—అయ్యా! ఋణము మాత్రము నిశ్శేష మానట్లు త్వరలోఁ దీర్పఁదగిన దేదిచేసినను సరియే. మిమ్ముఁగూడి మేముకూడఁ గష్టపడుచుంటిమి గదా!

కుము—ఆపద్బాంధవా! వాసుదేవా!

ఉ. బాధయొకింత లేక నినుఁ ♦ బ్రార్థనఁ జేయుదు రుత్తముల్ సదా
బాధయొకింత గల్గి నినుఁ ♦ బ్రార్థనఁ జేతురు మధ్యముల్ గదా
బాధవిశేషమైన నినుఁ ♦ బ్రార్థనఁ జేయుదు నీచు లాత్మలోఁ
బాధ వొలంగఁ జేసి నినుఁ ♦ బ్రార్థనఁ జేయఁగఁ జేయుమమ్ములన్. 23

సోమ—

శా. అంభోజాక్ష! నిలింపసేవ్య! పవనా ♦ హారేంద్రశయ్యా! హరే!
గంభీరాబ్ధి! మునీంద్రచిత్తనిలయా ♦ కైలాసవాసప్రియా!
శుంభన్నీలపయోదకాయ! విలస ♦ త్సారాబ్జనేత్రద్వయా
కుంభిప్రాణభయాపహార! యిదె సీ♦కున్ మ్రొక్కెదన్ బ్రోవవే. 24

[తుకారాం వర్తకులతోఁ బ్రవేశించును.]

సోమ—(తనలో) ఈ మహానుభావు లెవరోగాని నాకుఁ గొంత

సహాయము పడకుందురా? (ప్రకాశముగా) అయ్యా! నే నొక బ్రాహ్మణుండను. దరిద్ర బాధాపీడితుండ నేగాక ఋణ బాధితుండనై శృంఖలబద్ధుండనై యీ కింకరవశుండనైన నాయెడఁ గనికరాత్ములై యీవిపదబ్ధినుండి దాఁటింప సవినయముగాఁ బ్రార్థించు చున్నాఁడను.

వర్తకులు—అయ్యా! మీ రిది పుచ్చికొనుఁడు. (రెంటణాలనిచ్చెదరు.)

తుకా—అయ్యా! బ్రాహ్మణోత్తమా! మీ కిప్పటికిఁగల ఋణ మెంత సంఖ్యలో నున్నదో వచింపుఁడు.

సోమ—పుణ్యశీలా! మార్గస్థు లక్కడక్కడ నొసఁగిన దంతయు వెంట వెంటనే యిచ్చి వేయుచున్నందువల్ల నిప్పటికి నిల్చియున్న బాకీమొత్తము రెండువందల ముప్పదిరూపాయలు మాత్రము.

తుకా—అటులనా! సరే! (తనలో) నే నింటివద్ద బయలుదేరునప్పటికి నావద్దఁగల రెండువందల రూప్యములకు భగవత్కృపవల్ల నేఁబది రూప్యములు లాభించి యున్నందున నీరి బాకీ తీగునూన మునకు వెల్తిలేదు. కాఁబట్టి యీ యాపత్సముద్రమగ్నుండై యింత దైన్యస్థితిఁ బ్రార్థించెడి బ్రాహ్మణ సంరక్షణంబు కన్నఁ బుణ్యకార్యంబు లేదు. (ప్రకాశముగా) బ్రాహ్మణోత్తమా! శ్రీహరికి మీయందుఁగల కృపావిశేషంబువలన నేఁటికి ఋణవిముక్తులైరి. (కింకరులతో) ఓయీ! మీరీ రూప్యములఁ బుచ్చికొని యీ విప్రోత్తముని శృంఖలవిముక్తునిం జేయుఁడు.

కింక—(పుచ్చుకొని)అయ్యా! ఇదేతీయుచుంటిమి. (సంకెలందీయుదురు.)

సోమ—(సంతోషముతో) ధన్యోస్మి. ధన్యోస్మి. మహాపురుషా! శ్రీహరియన వేఱుగాఁ గలండా? యతండే నీరూపమున బ్రసన్నుండై నన్నుద్ధరించెఁ గాన నే నింతటినుండియు నిన్నే భగవంతునిఁగా నిత్యము స్మరించుచు సుఖించెదను. నీ వీ సూర్య

చంద్రు లున్నంతవఱకు వంశాభివృద్ధిఁ గలవాఁడవై యభీష్ట సిద్ధి గలవాఁడవు గమ్ము.

కుము—(సంతోషముతో) ఓహో! ఆపద్బాంధవుండవన నీవే గదా! మహాత్మా! నీవలన నేఁటికిఁ గృతార్థుల మైతిమి.

తుకా—ఓ పుణ్యదంపతులారా! ఋణవిముక్తిమాత్రము బొంది శూన్యహస్తములతో నింటి కేఁగ వలదు. ఈయిరువది రూప్యంబులఁ గొని చనుఁడు. (రూప్యము లిచ్చును.)

సోమ—సకలవాంచాఫలసిద్ధిరస్తు, (పుచ్చుకొని) పుణ్యాత్మా! నీ యనంతకరుణ కెంతయు సంతసించితి మిఁక మా కనుజ్ఞ నిమ్ము.

తుకా—(నమస్కరించి) చిత్తము.

సోమ—కుము—(నిష్క్రమింతురు.)

వ-ప్రి—(కోపముతో) తుకారామా! మొదటినుండియు మేము చెప్పిన దేమి? నీ విపుడు చేసిన దేమి?

తుకా-అయ్యా! మీరొనర్చినది హితోపదేశము. నేనొనర్చినది సత్క్రియ.

వ-ద్వి—ఇం కేమి చేయఁగలము? మనపని మనది. చాలు నిఁక రమ్ము.

తుకా—మిత్రులారా! కోపము విడచి నా యభిప్రాయమును వినుఁడు.

గీ. ధనము గూర్పంగవచ్చును ♦ దగినయంత
నిఖిల భూషణముల మేన ♦ నింపవచ్చు
మేలుగల్గు పదార్థముల్ ♦ మ్రింగవచ్చు
శ్రీరమాకాంతు మనసు రం♦జింపవలదె? 25

కాఁబట్టి సర్వము మన కొసంగుచున్న లక్ష్మీకాంతునకు సంతోషకరంబైన యిట్టి సత్కార్యములయందు మాత్రము మన మెన్నఁ డశ్రద్ధఁ జేయరాదు.

వ-ప్రి—మన హితవాక్యము లన్నియు నితనియందు నిష్ప్రయోజనము లగుచుండెను. కాఁబట్టి యితని మనశ్చాంచల్యము తుద కా

శ్రీహరియే మాన్పవలెను గాని పరులకు వశముగాదు.

వ-ద్వి—ఆమాట నీ విప్పటికి గ్రహింపఁ గలిగితివిగాని నే నిదివఱకు నుండియు నూహించియే యుంటిని. ఆలోచింపఁగా నితని కిది యొక పిచ్చిగాని మఱేమియుఁ గాదు. క్రమముగా నిఁక మనకుఁ గూడ నిదియేవిధ ముపదేశించి పాడుచేయుటకు సందేహము లేదు. కనుక నింతటితోనైన మన మీతని నుండి తప్పించుకొనుటయే మంచిది.

వ-ప్ర—ముందుగా జిజీబాయి కీవిధ మంతయుఁ దెలుపుదము. పదపద. (ఇద్దఱు నిష్క్రమించెదరు.)

తుకా—(ఆనందముతో)

సీ. శ్రీనాథు చింతతోఁ జెలఁగుచుండుటకన్న
నితరంబు ఘనమౌనె ♦ యెన్నఁడైన
సత్క్రియాలోలుఁడై ♦ సంచరించుటకన్నఁ
గలుగునే యన్యమే ♦ కరణినైనఁ
బ్రాజ్ఞుల ముదముతో ♦ వఱలఁ జేయుటకన్న
ఫలము గల్గునె యెట్టి ♦ పనులనైన
సర్థిమందారమై ♦ యలరుచుండుటకన్న
ఘనమౌనె మఱియెట్టి ♦ కార్యమైన

గీ. నిహమె శాశ్వతమంచు నూ♦హించి యుచిత
మైన సంచారశూన్యులై ♦ యవని కమిత
భారభూయిష్ఠులైనట్టి ♦ పరమమూర్ఖు
లిట్టి సుజ్ఞానపదవితో ♦ నెట్టు లుందురు? 26

కావున ననంతసంతోషంబైన యా రమాకాంతు నిత్యారాధనతత్పరస్వాంతుండనై మెలఁగెదను. (నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.



శ్రీమత్ప్రభాకరాయనమః

# భక్తతుకారాము

## ద్వితీయాంకము.



### ప్రథమరంగము—నివాసగృహము.

[జిజీబాయి విచారముతోఁ బ్రవేశించును.]

నాథుని కన్నివిధముల బోధించి పంపియుఁ దన మనశ్చాంచల్యము విడువనట్టుగానే వినినదాననై క్షామాధికంబున నాహారశూన్యులై మలమలమాడుచున్న పిల్లలఁ గాంచుచున్నందున నామనోవేదనయు మేరమీఱుచున్నది. లోకబాంధవియగుభవానీకరుణయుఁ గలుగదామె నే నేమి సేయుదును?

మ. ధనమాప్రాప్తముగాక నిత్యము మదీ ♦ యదైన్యానలంబెంతయున్
ఘనమై వేల్చుచునుండఁ దండులలవ♦గ్రాసంబు చేకూర్పఁగా
దినము న్గష్టదశాత్మనై మెలఁగు నా ♦ దీనత్వము న్గాంచకే
తన కేబాధయులేని నాథుని మనో♦దర్పంబు హెచ్చెం గదా! 27

[తుకారాము ప్రవేశించును.]

జిజీ—(కోపముతో) నాథా!

క. అరయఁగఁ దా నన్నిటఁ గను
దరియించిన పిదపఁ గాదె ♦ దయగలవాఁడై
పరులను బోధింపఁగవలె నను
పరధర్మము నడుపవలయు ♦ వసుధాస్థలిపై. 28

ఇంటియందు దాఁకలిచేఁ గడుపుమంటల సహింపనేరక నిత్యమార్చుచుండెడి కడుపారఁగనిన పసిపిల్లలకన్న మార్గమధ్యంబున మీ కాబ్రా

ప్రాణబాధయే భరింపరానిదయ్యెనా? పరబాధల నిజబాధలుగ భావించి మీరు కాపాడుచుండిరేగాని మీవలెఁ బరోపకారపారీణులై నాముద్దుపిల్లల యార్పు లరసి యెవరైనఁ గాపాడువారు కానరారైరి కదా! ఒకపూఁటయా? రెండుపూఁటలా? అనుదిన మన్నమన్నమని కడుపు చేతఁబట్టికొని యాఁకలితో నేడ్చుచు సొమ్మసిల్లెడి నాచిన్నికూనల మహాదైన్యస్థితి నిత్యముంజూచుచు నే నెట్లుభరింపఁగలను? భవానికేని నాయందించుకయు దయగలుగదాయెను. కడుపు గట్టిచేసికొని నే నెంతకాల మిట్లు భరింతును? నాయాపదఁ దీర్పువా రెవరుగలరు? లోకమంతయు నొక్కపెట్టుగ మ్రింగుట కేతెంచిన మహామారివంటి యీక్షామబాధకు ధనవంతులుసైతము సహింపఁ జాలక యాఁకులు, పండ్లు మొదలగువానితోఁ గాలముగడుపఁ దలంచి యరణ్యమున కేఁగుచుండిరి. ఇట్టియెడ నిర్ధనికురాలనగు నాకేమిగతి యోజించిరి? కటకటా! క్రియకు నా కేదారియుఁ గానరాదయ్యెఁ గదా! అయ్యో! ఉన్నఋణములకే యేడ్చుచున్నట్టినాకు మరల నీఋణబాధయే గలుగఁ జేసిరి. ఇది మీ కేమిధర్మము?

తుకా—సాధ్వీ! దుఃఖమును విడిచి శ్రద్ధతో నాపలుకులు విందువేని యంతయుఁ దెలిసినదాన వై విచారమునుండి మరలి సంతతానందవంతురాల వయ్యెదవు.

జిజీ—నాథా! మీబోధ వినకున్న దెపుడు? నాబాధలుమాత్రము గట్టెక్కకున్నవి.

తుకా—ప్రియురాలా! వినుము.

గీ. వఱలు జగమెల్ల శ్రీహరి ♦ వశము సుమ్ము
మాన్యుఁ డగు సల్లశ్రీహరి ♦ మంత్రివసుఁడు
నఖిలమంత్రంబు లలవిప్రు ♦ లందుఁ గలిగి
పరఁగుటను దేవదేవుఁ డా ♦ బ్రాహ్మణుండు.

కాఁబట్టి యట్టివిపన్నమహాబ్ధిమగ్నుండై రక్షింపుమని యర్థించిన భూదేవునిఁ గాపాడుటకన్నఁ బుణ్యకార్యంబు గలదే? అదియుఁగాక,

చ. ధరఁగల జీవకోటియెడఁ ♦ దద్దయుఁ గూర్మిని జూపుచుండి దు
ర్భరతర బాధలెల్ల నల ♦ ప్రాణుల కబ్బుటఁ గాంచినంత మే
దురమగు ప్రేమతోడ వెసఁ ♦ దోడ్పడి యాత్మనుబోలె వారి నా
దరణము మీఱఁగా మనుటయె ♦ ధర్మము వారిజపత్రలోచనా. 30

మఱియు సమస్తసృష్టికి సాక్షీభూతంబులైన పంచభూతంబులు నట్టి సత్కర్మలనే గదా చూచి యానందించుచుండును. మఱియు నట్టి విపన్నులఁ గాంచియు దయావిహీనుండైనవానిఁ జూచిన బుద్ధిమంతులు సహింపఁగలరా? భూమిభరించునా? ఒకవేళ దుఃఖముతో భరింపక తీరకున్నఁ బ్రయోజనమేమి? నిష్పక్షపాతుండును, సర్వసమశీలుండును గాని ధర్మలుబ్ధుం డుభయపిశాచగ్రస్తుండై యధికారికిఁ దనసర్వంబు నర్పించిన నది యౌదార్యముగా నట్లు బలవంతమైన ప్రేరణతోఁ జేసెడి ధర్మంబు ఫలవంతముగాదు గదా! పరమార్థప్రదములైన దానములలో సైతము చేరదుగదా! జన్మమెత్తి యదియే శాశ్వతమనియుఁ దనకుఁ గల్గెడి సంతతియే చిరరూపమనియు భావించి దినదినము పరిమితిలేని దురాశాక్రాంతితమానసుండై ధనమార్జించుచు నాత్మసంరక్షణోపాయంబులతోడనే కాలమంతయుగడపి దండధరునికి మితిలేనిపనిగల్పించుటకన్న సద్గుణగరిష్ఠుండై జన్మరాహిత్యక్రియాలోలుండై యుండవలదే?

క. పరమాత్ముని లీల భువిన్
నరుఁడై జన్మించి సర్వ♦నయవిదుఁ డౌచున్
బరులకు సర్వవిధంబుల
నిరతం బుపకారసరణి ♦ నెగడఁగవలదే. 31

అదియుఁగాక 'పరోపకారార్థ మిదమ్ శరీరమ్' అనెడి పరమధర్మ మనుసరించి పనిగలుగునేని తనశరీరమునైనఁ బరులకొఱకు ధారబోయవలదే?

అట్టి యుపకార శూన్యంబైన జన్మంబుకన్న భూభారంబు గలదే ?

జిజీ—నాథా ! అటులయినఁ బ్రజలెల్లరు మీవలె నిట్టి ధర్మబుద్ధినే యనుసరించి మెలఁగుచుండి రేమి.

తుకా—(నవ్వుచు) ప్రియురాలా ! మహాదురితక్రియాలోలురైన పాపాత్ములఁ బోలి నేను సంచరింపనేమి ? కావున నీ వదియుటుగఁ దగిన యభిప్రాయంబు గాదు. ఇంతియెగాక,

క. వెనుకటి జన్మకృతంబగు
తనకర్మమువలనఁ గష్టతతిగల్గె నటం
చును భావింపుచు నిప్పుడై
నను సద్విధి జన్మబాయ నడువఁగవలదే. 32

[నలుగు రప్పులవారు ప్రవేశించెదరు.]

తుకా—అయ్యా ! ఇటఁగూర్చుండి వచ్చినకారణమును దెలుపుఁడు.

అప్పు—(కూర్చుండి యందుఁ బ్రథముఁడు) అయ్యా ! తుకారామా ! తాత తండ్రులనాఁటినుండియుఁ గల సమస్తాస్తియు నీ యిష్టాను సారముగా వ్యయమొనర్చి యిప్పటికేమియు లేనివాఁడవై క్రియకుఁ బిచ్చియుఁగలవాఁడవై మెలఁగుచుండినట్టుగా నిదివఱకే వినియుండియు మాకు నీ విర్వవలసియున్న బాకీలు కూడ నే దినమో తెచ్చియిచ్చెదవనియే యింతవఱకు భావించి నిరీక్షించు చుంటిమి గాని యటు లొనరింపవైతివి. మే మింక నుపేక్షింపఁ దలంపలేదు. కాఁబట్టి యీపద్దులప్రకారము లెక్కజూచి తేలెడి యసలు వృద్ధుల మొత్తములన్నియు నీక్షణములో మాకిచ్చి పద్దుల రద్దుజేయకతప్పదు. (పద్దులు చేతిలోనుంచిచూపుదురు.)

తుకా—(తనలో) హా ! పరమేశ్వరా ! ఎట్టి యిక్కట్టులఁ గలుగ జేయుచుంటివి,

మ. ధనము న్భూములు బట్టలుం విపులమా ♦ ధాన్యంబులుం ధేనువుల్
ఘనరత్నాన్వితభూషణావళియు ము ♦ క్తామాలికల్ మేలు భో
జనపాత్రంబులు పెట్టెలుం మఱియు నా ♦ సర్వంబునోలోప్పె యె హా!
తినఁగాఁ దిండియు లేకపోయె సకటా ♦ దీనుండ నే నేఁగదా. 33

(శ్రీహరీ! నన్నుఁబరీక్షించుటకుఁగా నిడుముల పై నిడుములఁగల్పించుటయే గాక పైగా నప్పులవారి దండనయు రావించితివా! సరే! (ధైర్యముతో)

గీ. అనుభవింపఁగ లేనట్టి ♦ యమితకష్ట
వితతి యనునట్టి జలధిలో ♦ విడిచిపెట్టి
యాదఁ గలుగుటఁ గనిపెట్టి ♦ యీర్ష్యవీడి
భక్తులను బ్రోచెదవుగాదె ♦ పరమపురుష. 34

అయిన నాకిపుడు కర్తవ్యమెద్ది ? (ఆలోచించి) సరే ! (ప్రకాశముగా) ఆర్యులారా ! నే నిపుడు సర్వశూన్యుండనై యుంటినని మీరెల్ల రెఱింగిన విషయమే గదా ! ఇట్టి నేఁ జేయఁదగిన దేమియో వచింపుఁడు.

అ-ద్వి—ఋణములన్నియు నిశ్శేషముగఁ దీర్చికొనుటయే చేయఁదగినది.

తుకా—ఎట్లు ?

అ-తృ—అది మనుష్యుఁడుగఁ దగిన మాటకాదు.

తుకా—అటులయిన నాకివ్వఁదగినవాఁ డిచ్చువఁడు కాఁగుఁడు.

అ-చ—భగవంతుఁడే నా నీకివ్వఁదగిన వాఁడు ?

తుకా—అంతకన్న సమర్థు లెవరు ?

అ-ప్ర—అయ్యా ! ఎందుల కీ వ్యర్థవాదములు ? భగవంతుఁడు నీకిచ్చుటెన్నఁడు ? మేమది పుచ్చుకొనుటెన్నఁడు ? నీవిఁక నీ పిచ్చి వేదాంతమంతయుఁ గట్టిపెట్టి నేఁ జెప్పునటు లొనర్తు వేని యనాయాసముగా ఋణవిముక్తుఁడ వయ్యెదవు.

తుకా—అదియు వచింపుము.

అ-ప్ర—ప్రస్తుతమందైన నీయవస్థనంతయుఁ గొందఱు గ్రామస్థులకుఁ దెలుపుకొందు వేని వారి సహాయమున ఋణశూన్యుఁడ వయ్యెదవు,

తుకా—(ఆలోచించును.)

అ-ద్వి—అయ్యా! ఆలోచింపనక్కఱలేదు. నిస్సందేహముగా నీవటు లొనర్చుటయే శ్రేయస్కరము.

తుకా—సరే! భగవదాజ్ఞానుసార మొనర్చెద మీరేఁగుఁడు.

అ-ప్ర—మంచిది.

అ-తృ—మరల నాలస్య మొనర్పఁదగదు సుమా.

తుకా—ఉచితకాలము నా భగవంతుఁడే ప్రేరేపించును.

అప్పా—(అందఱు నిష్క్రమించెదరు.)

[దామోదరుఁడు ప్రవేశించును.]

తుకా—సోదరా! రమ్మిటఁ గూరుచుండుము.

దామో—అన్నయ్యా! అభివందనము. (నమస్కరించును.)

తుకా—తమ్ముఁడా! ఇష్టసిద్ధుండవై వృద్ధినొందుము.

దామో—వదినెగారికి నమస్కారము. (నమస్కరించును.)

జిజీ—నాయనా! వంశాభివృద్ధి గలవాఁడవు కమ్ము.

తుకా—దామోదరా! ఇటఁ గూర్చుండి నీరాకకుఁ గల కారణమును దెల్పుము.

దామో—అన్నయ్యా! (కూర్చుండి) పిల్ల లుల్లాసముగాఁ దిరుగుచుండిరి కదా!

జిజీ—కన్నతండ్రికన్నఁ బినతండ్రివై నీవైనఁ గొంత ప్రేమ జూపుటయే యుల్లాసకరము.

తుకా—తమ్ముఁడా! జగత్కర్తయగు శ్రీహరి కృపానుసారము వృద్ధి నొందుచు నిరుగు పొరుగు పిల్లలతోఁ గూడి యాడుకొనుట కేఁగియుండిరి. బహుదినంబులకు వచ్చిన నీయభిమతంబెయ్యది?

దామో—అన్నయ్యా! నీకుఁ దెలియని పరమధర్మములు లేవుగదా! (దుఃఖముతో)

సీ. మన ముప్వురను గన్న ♦ జననియుఁ దండ్రియు
నఖిలభారంబు మీ♦యందు నిడిరి
కాంతావియోగదుః♦ఖముతోడఁ బెద్దన్న
దేశాంతరము కేఁగె ♦ దీనుఁడౌచుఁ
బెద్దభార్యాసుతుల్ ♦ విబుధలోకము జేరు
టాదిగా మోహార్థి ♦ వైతి వీవు
మీదంపతులయందు ♦ మిగుల భక్తిని గల్గి
తలిదండ్రులంచు నేఁ ♦ దలచుచుంటి
గీ. గాని యొకనాఁటికేనియుఁ ♦ గడుపునిండు
నట్టియన్నంబు లేక నే ♦ ననవరతము
నాఁకలికిలోంగి మీవలె ♦ నణఁగియుండఁ
జాల ననుఁగావు కరుణతో ♦ సదయ హృదయ. 35

జిజీ—(విచారముతో) అయ్యో! నాయనా! అన్నగారినుండి వేఱుగా బ్రతుకుచుండిన నీకుఁగూడ మాయవస్థయే పీడించుచుండెనా? (భర్తతో) నాథా! పిల్లలు నాగర్భమందుఁ బుట్టినవారగుట వల్ల వీరలఁబెంచు భారముఁగూడ నాయందే విడిచి మీయిష్టాను సార ముపేక్షించుచుండిరిగాని యితఁ డన్యాధారమిసుమంతయు లేక మిమ్మునే నమ్మివచ్చిన మీసోదరుఁడు గనుక వీనియందుఁ గూడ మీయనాదరణ భావమునే జూపుటధర్మముగాదు సుఁడీ.

తుకా—(శిరఃకంపము జేయుచు) సోదరా! దామోదరా! ఇపుడు నీకొఱకుఁ గాకున్నను లోకులను గూర్చియైన నేనొక విషయ మును బ్రసంగించెదను. శ్రద్ధతో వినుము.

దామో—అన్నయ్యా! భక్తితో వినెదను.

తుకా—నాయనా! మన పితృక్రమాగతంబైన చరస్థిరరూపక సమస్తా స్తియు నే విధముగా నశించెనో నీవెఱిఁగియే యుంటివి గదా!

దామో.—అన్నయ్యా! ఎఱుఁగ కేమి? అంతయు నెఱుంగుదును.

తుకా.—తమ్ముఁడా!

మ. ధనవిద్యాగ్రహణేచ్ఛ గట్టుచుఁ బ్రియ♦త్నంబుల్ సదా జేయు నీ
జన సంఘంబున నందఱుల్ ధనికులై ♦ సత్పండితుల్ గల్గ ని
ర్ధనికుల్ మూర్ఖులు నుండ నేటి కవి ♦ యాంతర్యంబునం దారయం
గను ప్రారబ్ధము నాశ్రయించియె కదా♦ గల్గున్ బహుస్వల్పముల్.

దామో.—అన్నయ్యా! మీరు సెలవిచ్చినట్లు విద్యాధనాదిప్రాప్తిమున కదృష్టమే ముఖ్యమనుట సత్యము. కాదేని దరిద్రులు, పామరులు, నిస్సంతతులు గలుగరు.

తుకా.—సోదరా! అట్టి ప్రాప్తానుసారాగతధనంబు ఋణక్షయకాలం బాసన్నమైనంతనే యెద్దియైన మిష జూపుచుఁ గాని, యకారణముగాఁ గాని నశించుటఁ గాంచునట్టి లోకులలోఁ గొంద ఱజ్ఞాన తమోమగ్నులై యాగృహాధిపత్యాదులం దెద్దియేని వచింపరాని నిందారోపణంబు గావించి ధనక్షయకారులైనట్టుగాఁ బల్కుచుండు దురాచారం బచ్చటచ్చటఁ గలదు. నీ వది పరికించియే యుంటివి గదా!

దామో.—అన్నయ్యా! ఆ యాచారము సుకవి ప్రయోగములఁ గాంచి కుకవి దూషించుటవంటిది. అట్టిదానివల్ల సత్తముల పరమార్థమునకు భంగ మెన్నఁడు గలుగ నేరదు.

తుకా.—తమ్ముఁడా! అదియుఁ గాక,

గీ. ప్రియముతోఁ గన్న పిల్లలే ♦ విధివశమైనఁ
కష్టతరమైన రోగ సం♦కలితు లౌచు
బ్రతుకకుండిన నది దైవ ♦ వశము గాక
కనినవారలు చంపిరం ♦ చనఁగఁ దగునె? 37

కాఁబట్టి సోదరా! మన కదృష్టవశంబునఁ గలిగిన ధనసంపత్తి

యంతయు దురదృష్టవశంబున నేఁటికి నశించినది. లోకు లీ పరమధర్మం బెఱుంగక నేనొక పిచ్చివానినై గాని, యవివేకినై గాని, దుర్వ్యసనవంతుఁడనై గాని పోఁగొట్టినట్లు పాపభీతిలేని నీమలు వచించినప్పటికి నీ వా మాటలు పాటిసేయఁ దగదు.

దామో—అన్నయ్యా! మీరు నన్నెంత మూర్ఖునిఁగా భావించినను సరే గాని, సద్వంశసంభూతుండ, విశేషించి మీకు సోదరుండ నగుటచేత భగవంతుఁ డా పాపబుద్ధిమాత్రము నా కెప్పటికైనను బుట్టించునని నే నెన్నఁడు నమ్మఁజాలను. అదియుఁ గాక

క. వెనుకటికిఁ దనకుఁ గలిగిన
ఘన మక్కఱ గలుగువఱకు ♦ దాఁచఁగ వశమే
ఘనచంద్రకిరణసంచయ
మును జీఁకటి నాఁటి కుంచ ♦ మురహారివశమే. 38

కనుక నాకట్టి నీచబుద్ధి యెన్నఁటికైనఁ బుట్టునని మీరును దలంపవలదు. మఱియు గతజలసేతుబంధన తుల్యంబుగా గతించిన మన యైశ్వర్యమును గూర్చియు విచార మొందఁదలఁచువాఁడను గాను.

తుకా—దామోదరా! నీయంతఃకరణశుద్ధికి సంతసించితిని గాని క్షుత్పిపాసలకు మాత్రమోర్వఁజాలని యతిదీనుండనై సంసారమోహావశాత్ముండనై నందులకు మితిలేని విచారవంతుఁడ నౌచుంటిని.

దామో—అన్నయ్యా! పూర్వజన్మార్జితభక్తి లేశంబైన లేనట్టి సామాన్య మనుష్యమాత్రుఁడనైన నేనింతలో నే జితేంద్రియుండనగుట కేపాటివాఁడను? నీవంటి సజ్జనసేవయే క్రమంబున నన్నుద్ధరింపఁగలదు.

తుకా—తమ్ముఁడా! నీకిప్పటికిఁగల ప్రాజ్ఞతనైన విడువకుందువేని క్రమంబుగ భక్తసంఘంబునఁ గలియఁగలవు. ప్రస్తుత ప్రధానం

బైన నీయవస్థకై లోకులవలన మనకురాఁదగియున్న బాకీప త్రింబులలో సగముమాత్రి మివిగో. (ఇచ్చి) వీనితో లోకులకు భాధగలుగఁజేయక మంచితనముతోఁ బ్రాప్తమున్నంత రాఁబట్టుకొని సన్మార్గముగాఁ గాలము గడుపుకొనుము.

దామో—(సంతోషముతోఁ బుచ్చుకొని) అన్నయ్యా! దయతో మీరొసంగిన తృణమైన మహామేరుతుల్యంబుగా భావించి మీయాజ్ఞను శిరసావహించి క్రమముగా సంచరించెదను.

తుకా—సోదరా! లోకులను బాధించుట నాబాధగా భావించియు నీయవస్థను బట్టియేగాక నీసాధుశీలంబున కెంతయు సంతసించి సగముపత్రముల మాత్రి మిచ్చినందుల కన్యథా భావింపక సంతసింపవలయుఁ జుమా.

దామో—సంతోషమే గాదు. అపరిమితసంతోష మొందితిని.

జిజీ—నాథా! సగము పత్రముల సోదరుని కిచ్చుచున్నందునఁ గొదువ సగమువల్ల నాపిల్లలుగూడఁ గొంత కాలమైన సుఖింతురని యత్యానందమందితిని గాని తరువాత వచించిన మీపలుకులాలించి నాజన్మ కిఁక సౌఖ్యంబుగలుగ నేరదని యే నిశ్చయించుకొంటిని.

తుకా—(నవ్వుచు) ప్రియురాలా! పరులను గష్టపెట్టి తాను సుఖించుటకన్నఁ దాఁ గష్టమొందుచుఁ బరుల నానందింపఁజేయుట మహోత్కృష్టము గనుక మనయందా శ్రీహరియొక్క పరిపూర్ణకరుణయే గలిగియున్నదని త్రికరణశుద్ధిగా భావించి విచారింపకుము.

దామో—అన్నయ్యా! జీవులందఱును నీకు సములని యుపదేశింప నే నీపాటి వాఁడను? కావున నోరు తెరువని పసిపిల్లలను, సాధ్వీమణులగు మావదినెగారిని సుఖంపఁజేయ వేఁడెదను.

తుకా—(నవ్వుచు) తమ్ముఁడా! సర్వసముఁడు, సర్వసమర్థుఁడు నయిన యాభగవంతుఁడు గదా సుఖింపఁజేయుఁదగును. అంతియే గాని సామాన్యుఁడ, నశక్తుఁడ నగు నేనేమి చేయఁగలను?

దామో—అన్నయ్యా! నేనిఁక నేఁగెదను. వదినెగారూ! విచారమును విడిచి నాకనుజ్ఞ నొసంగుఁడు.

ఉభయులు—నాయనా! మంచిది.

దామో—(నిష్క్రమించును.)

తుకా—(తనయింటిప్రక్కనుండి పోవుచున్న యొకవృద్ధాంగనను జూచి తనలో)

గీ. జీవులన్నింటిలోనఁ దాఁ ♦ జెలఁగునట్టి
హరికిఁ బ్రీతిరూపసంఘము ♦ ననఁగఁ దగిన
దాచు నొప్పెడి లోకము ♦ నరసి భక్తు
లవనిఁ దద్దాసులౌదురు ♦ నలర వలదె? 39

కాఁబట్టి యీముసలి యతిప్రయత్నముతో నెందులకో పోవుచుండె నేనిత్తఱి సహాయుండనై యీమె శ్రమలోఁ గొంతయైన నుపశమింపఁ జేయుటయే న్యాయము. (ప్రకాశముగా) ఓవృద్ధమాతా! నీవెందుకో యిచటికి నేఁగుచుంటివి? దయయుంచి యించుక వచింపుము.

వృద్ధ—నాయనా! తైలముకొఱకు కంగడికిఁ బోవుచుంటిని.

తుకా—అటులనా! ఈమాత్రకార్యము నకై శతవృద్ధవైన నీవే వెళ్ళవలెనేమి?

వృద్ధ—(ఆశ్చర్యముతో) అయ్యో! నాయనా! ఈకలికాల మహిమవల్లనో నేఁజేసికొనిన కర్మఫలమువల్లనో గాని పుత్రులు, పౌత్రులు, దుహితలు, దౌహిత్రులు మొదలగువారింటఁ బుట్టెడుమందిగలిగియు శతవృద్ధననెడి కనికరముగాని, భక్తిగాని యిసుమంతయు నాయందుఁ జూపక, కేవలము వారిరాజ

సము, యౌవనాతిశయము, నిర్లక్ష్యభావము క్షణ క్షణ విశేషంబైన నవనాగరిక విలాసముం జూపుచుఁ బరిజనులకైన నవకాశంబొసంగక మెలంగుటంగాంచి యసహ్యత గలిగి యట్టివారి చేతఁ జేయించుకొనుటకన్న నేస్వయముగాఁ జక్కఁబెట్టుకొనుటయే మంచిదని వంటవేళ మించకుండ నెమ్మదిగా నిట్లు బయలుదేరితిని.

తుకా—(ఆశ్చర్యముతోఁ దనలో) ఓహో! లోకస్థితి మొత్త విపరీతముగా నున్నది.

సీ. కులధర్మమును మీఱి ♦ పలువు రాక్షేపించె
దరు నన్న నిర్భీతిఁ ♦ దిరుగువారు,
పెద్దలందున భక్తి ♦ పెన్నిధియను బుద్ధి
దొలఁగి మూర్ఖముతోడ ♦ మెలఁగు వారు,
నత్తమామలు పూజ్యు ♦ లంచు నెంచక పతి
దయకు గర్వాత్మతోఁ ♦ దనరువారు,
నాప్తవర్గము వీడి ♦ యన్యులతోఁ గూడి
మందిలేకయ సంచ ♦ రించువారు,
గీ. తల్లిదండ్రులఁ దృణవిధిఁ ♦ దలఁచువారు,
నేతలందుఁ గృతఘ్నత ♦ నెగడువారు,
పాపులందు మహాదయఁ ♦ జూపువారు,
నవనియంతయు వ్యాపించి ♦ యలరుచుండ్రి. 40

(ప్రకాశముగా) అమ్మా! అటులయిననన్ను నీపుత్రతుల్యునిగా భావించి, నాభుజముపైని గూర్చుండుమేని నీకనాయాసముగా నవసర మైన చోటునకుఁ దోడ్కొనివెళ్ళి మరల నీయింటివద్ద దింపెదను.

వృద్ధ—(సంతోషముతో) నాయనా! ఇప్పటిలో నీవంటిపరోపకారి నీకన్నఁ గానరాఁడు. అట్టి నీ విపుడు వ్యర్థముగా నన్నుఁగూడ

నచటికి మోయఁదగినంతటి యవసర మేమున్నది? దయగల దేని యీపాత్రయు నీకొఱకు నుపయోగ మగుచు నున్న తైలమును దీసికొని యీపక్కనుగల యీయింటికిఁ దెచ్చియిచ్చు నంతలో నే నిల్లు జేరి యుండెదను. నీవింతకన్నఁ జేయఁబని లేదు.

తుకా—తల్లీ ! అటులనే జేసెదను. (పాత్రను లందుకొనును).

వృద్ధ—నాయనా! ఇంటి గుర్తెఱుంగుదువు కదా ?

తుకా—అయ్యో ! తల్లీ ! నే నెఱుఁగకేమి ? అదిగో కనిపించు నది యే కదా ?

వృద్ధ—ఔను నాయనా ! నే నింక నెమ్మదిగా నడచెదను.

తుకా—అమ్మా ! స్వల్పకాల మిచట నిరీక్షింతువేని యింతలోఁ దైలమును దోడ్కొనివచ్చి నిన్నుఁ గూడ నెత్తుకొని సుఖము గా నింటఁ జేర్చెదను.

వృద్ధ—(నవ్వుచు) నాయనా ! నీ కంతశ్రమ వలదని మొదట నే జెప్పి యుంటిని. కాఁబట్టి తైలమున కేఁగి రమ్ము. నే నడచెదను. (నిష్క్రమించును).

తుకా—అమ్మా ! అటులనే జేసెదను. (తనలో) ఓహో ! నాపూర్వపుణ్యవశంబున నిట్టి పరమసంతోషకరంబైన విశ్వసేవా వృత్తియు లభించినది. (ప్రకాశముగా) ప్రియురాలా ! అప్పాల వారు చెప్పియున్న పనియు నెరవేర్చి వచ్చెదను.

జిజీ—నాథా! తమకాపరోపకారము నందుగల ప్రేమలో సహస్రభాగమైనఁ బిల్లలయందు లేదాయె. సరే ! వెళ్ళి త్వరగారండు.

తుకా—అటులనే వచ్చెదను. (నిష్క్రమించును).

(ఆటలోనుండి పిల్లలు ప్రవేశించెదరు.)

జిజీ—(కౌఁగిలించుకొని) బాబూ ! మీరందఱెచ్చటినుండి వచ్చిరి ? శరీరము లిట్లు దూళితో నిండియున్న వేమి?

విఠో—అమ్మా! పిల్లలందఱితోఁ గూడి యిసుకలో నాడుకొని వచ్చితిమి.

జిజీ—కుమారా! ఈ వ్యర్థము లయినయాటలతోఁ గాలమును గడపుటకన్న విద్యార్థు లగుబాలురతోఁ గూడి పాఠశాల కేఁగుచుఁ జదువుకొనిన బాగుగానుండును గదా?

భాగీ—అమ్మా! ఇచ్చవచ్చిన 'గుజ్జెనగూళ్లు, బొమ్మలపెండ్లిండ్లు, కప్పగెంతులు, వెన్నెలకుప్పలు. పాల్గుమ్ములు, పొడుపుకథలు' మొదలయిన యాటలకన్నఁ జదువువల్ల నేమి కలుగఁగలదు? మే మీయాటలనుమాత్రము నీ వెన్ని చెప్పినప్పటికి విడువము.

జిజీ—(నవ్వుచు) అమ్మా! చిన్నతనమువల్ల విద్యావిశేషము మీ కేమి తెలియఁగలదు? అది లేకున్న సాధారణముగా జ్ఞానంబు సున్న. అట్టి జన్మంబుకన్న భూభారంబు వేఱుగా నుండఁజాలదు. ఏమంటి రేని,

మ. పలురత్నస్థగితంబులై విపులభా ♦ స్వంతంబులౌ కుండలా
దులు ముక్తాదిపరికల్పితంపుసరముల్ ♦ హారంబులౌ నూపురం
బులు కేయూరములుం ధరింపకయె సం ♦ పూర్ణంబుగా నందమౌ
విలసద్రూపము విద్య గల్గుటను నా ♦ విఖ్యాత మై యొప్పెడిన్. 41

మఱియు రూపవంతం బైన యాఘనవిద్యావిశేషం బెన్న సహస్రముఖుం డైనయనంతుని కైన సంపూర్ణశక్తి జాలదు కదా!

గీ. చోరులకు గానరానిది ♦ సుఖము గలుగఁ
జేయునది, కీర్తి ఘటియించి ♦ చెలఁగఁగలది
దానమున వృద్ధిఁ గానది ♦ ధారుణీశ
గర్వ మడఁగించునది విద్య ♦ కన్నఁ గలదె? 42

కావున నేటినుండి శ్రద్ధాలువారలై ప్రతిదినంబును బాఠశాల కేఁగుచు సర్వోత్కృష్టతర మైనవిద్య నభ్యసింపుదు రేని దానివల్లనైన

భావికాలమునసౌఖ్యంబు నొందఁగలరు.

గంగ—అమ్మా! తమ్ములనే వెళ్ళుమంటివా? మమ్ములనుగూడ బడి కేఁగుమంటివా?

జిజీ—అమ్మా! బెల్ల మొకరికి మధురము, మఱియొకరికి విషము నగునా? అందఱికి సమానమే గాన మీరందఱు నభ్యసించు టయే యుత్తమము.

గంగ—అటులైనఁ గాలమును వ్యర్థపఱచుటవల్ల నేమిలాభము? విద్యయే సంపాదించుకొనెదము. (పిల్ల లందఱు నిష్క్రమించెదరు.)

జిజీ—ప్రాణనాథుఁడు విశ్వసేవావ్రతంబున మగ్నుండై యిల్లుగూడ మరచెనాయేమి? (మార్గమును బరికించును.)

[తుకారాము ప్రవేశించును.]

జిజీ—(విచారముతో) నాథా! నే నెన్నివిధముల బోధించి ప్రార్థించి నను వినవట్టి యిప్పటి మీనడవడి నా కంతయు హృదయకంటకమై పీడించుచున్నది.

క. అర్ధాంగి నైన నాదగు
ప్రార్థన మన్నించి యింటి బాధ్యతఁ గనుచున్
సార్థకముగా నొనర్పఁగ
నర్థించితిఁ బ్రొవు మటుల నభయం బొప్పన్. 43

తుకా—ప్రియురాలా! నీ కంత పీడించుటకు నే నేమి తప్పుపనులఁ జేయుచుంటిని? సర్వోత్తమం బైన విశ్వసేవావ్రతం బేగాదా యాచరించుచుంటిని. అదియు,

సీ. ఆధారశూన్యులై యర్థించుచుండెడి
దీనుల కోర్కులఁ దీర్చుచుంటిఁ

బధికమార్గాయాశ ♦ వశతఁ గాంచఁగ లేక
చేరి తత్పదసేవఁ ♦ జేయుచుంటి
భక్తితత్పరులైన ♦ భక్తుల పాదర
క్షలు శిరోధృతోడను ♦ గాంచుచుంటిఁ
చీమల నల్లులన్ ♦ దోమల నరయుచు
నిష్టమౌ నాహార ♦ మిచ్చుచుంటి
గీ. మార్గముల బాగుజేయుచు ♦ మసలుచుంటి
భక్తినియమంబు గల్గుచు ♦ బ్రతుకుచుంటి
సజ్జనుల పాదపూజను ♦ సలుపుచుంటి
దేవు నెల్లరు ప్రార్థింపఁ ♦ దెలుపుచుంటి. 44

కాంతామణీ! నిర్మలచిత్తముతో నీవియందు విసర్జనీయం బెయ్యదియో స్పష్టంబుగావించెదవేని యవశ్యము వినువఁగలవాఁడను.

జిజీ—జీవితేశా! అసహాయులు నశక్తులు నగు నిఱుపేదలుగాని యాపన్నగ్నులుగాని యొకరిసహాయ మపేక్షింపఁదగు, నట్టిదాని మీరంగీకరింపనుదగును గాని ధనమత్తులు సైతము నిరాధారులకైవడి సర్వోపచారంబులు మీచేతఁ జేయించికొనుచుండుటను గాంచియు వినియు నే నెట్లు సైఁపఁగలను?

క. నిరతము దా సేవించెడి
వరుని దయారసము సతముఁ ♦ బరులందునఁ గిం
కరవృత్తి సలుపఁ గని యే
తరుణీమణి సైఁపఁగలదు ♦ తథ్యం బరయన్. 45

తుకా—(నవ్వుచు) ప్రియురాలా! నీయభిప్రాయ మొకవిధముగా సత్యమైనను, ధనమత్తులు, నిఱుపేదలు ననెడిభేదం బాలోచించినఁ గేవల మైహికభావోద్రేకంబు గాని, యాముష్మికప్రభావంబున నిసుమంతయు నూహింపఁ జనదు. ఏమంటవేని, భగ

వంతునికి సమస్తజీవకోటియు సమానము. అన్నిటను దాను గలఁడు. అట్టి సర్వము నిష్పక్షపాతముగా నా కత్యంత ప్రేమాస్పదము. కాఁబట్టి యింతవఱకుఁ గల నీమనోవికారము నిశ్శేషముగా విడువఁ దగినదని గ్రహించి యీ శ్రీహరిని సదా భజింపుచుండుము. అట్టి నిశ్చలభజనయే మితిలేని సంతోషకారి కాఁగలదు.

జిజీ—నాథా! సంసారకూపంబున మునిఁగియున్న నాడెందంబును మీ హితోపదేశం బెప్పటికాకర్షించునది యుఁ దెలియఁజాలను. సెలవొసంగుదు రేని స్నాన మొనర్చి వంట జేయుట కేఁగెదను.

తుకా—ప్రియురాలా! మంచి దటుల నే జేయుము.

జిజీ—చిత్తము (నిష్క్రమించును).

తుకా—(తనలో) నే నివ్వఁ దగియున్న ఋణవిముక్తి జేసికొనుట కేఁగి నప్పుడే నాకివ్వవలసియున్న యప్పులవారి నెప్పటికైన బాధింపఁదగి నావద్దనుండిన సగము ఋణపత్రముల నిందాఁ్రణీనది కర్పించి లోకపీడాకరం బైన దోషమునుండి తప్పించుకొనిన వాఁడనై ధన్యుండనైతిఁ గనుక నొకసారి పరమానందముగా హరినామ సంకీర్తనము జేసికొనెదను. (సంతోషముతో),

శా. రాకాపూర్ణశశాంకవక్త్ర! విలస ♦ ద్రాజీవపత్రాయతా
క్షా! కారుణ్యరసోపజీవితగుణా ♦ కల్యాణసంధాయకా!
పాకారిప్రముఖార్చితాంఘ్రియుగళా ♦ భక్తానుమోదాత్మకా!
నీ కేఁ జేతు ననేకవందనములన్ ♦ నిత్యంబు లక్ష్మీపతీ. 4

(ఎదుటఁ బరికించి) ఓహో! వస్త్రవిషయంబున నతిదరిద్రదశంజూపుచు నావచ్చు బ్రాహ్మణుం డెటుబోవునో గదా!

[శిథిలవస్త్రముతో మాధవశర్మ ప్రవేశించును.]

తుకా—విప్రవర్యా! నమస్కారము. (నమస్కరించును.)

మాధ—సకలవాంఛాఫల సిద్ధిరస్తు.

తుకా—(భక్తివినయములతో) బ్రాహ్మణోత్తమా! ఇచ్చటఁగూర్చుండి తమనామం బెయ్యదియో మీ రేతెంచినకారణసహితంబుగాఁ దెలిపి నన్ను ధన్యునిఁ జేయింపఁ బ్రార్థించుచుంటిని.

మాధ—మహానుభావా! నాపేరు మాధవశర్మ యందురు. నేవచ్చినకారణమును నాయవస్థయే తెలుపుచున్నను వచించెదను వినుము.

తుకా—చిత్తము. విప్రోత్తమా! గమనాయాసము మి మ్మెంతపీడించుచున్నదో గదా! (పాదముల నొత్తుచుండును.)

మాధ—(సంతోషముతో) పుణ్యాత్మా! నీవంటి భూతదయాపరుఁడైన భక్తశిఖామణిని వేఱొకని నీచతుర్దశభువనంబులఁ గానఁజాలను. ఓహో! నీవంటి నిర్మలాత్మునికేగదా సశరీరస్వర్గంబుగూడ హస్తామలకంబుభాతి ఫలించును.

తుకా—(పాదము లొత్తుచు) భూసురోత్తమా! అట్టి తమస్తుతిపాత్రలకు నే నెంతమాత్రి మర్హుండను గాను. నేఁ గోరినది వచించి నన్నానందింపఁ జేయఁ బ్రార్థితులు.

మాధ—పుణ్యాత్మా! సామాన్యులఁబోలి నేను మిథ్యాస్తుతు లొనరించువాఁడను గాను. యథార్థము నే వచించుచుంటి నని భావింపుము. ఇఁక నాయభిమతప్రయోజనము గూడ వివరించెదను.

తుకా—చిత్తము. అదియే మన్మానసానందముఁగా భావించి వినెదను.

మాధ—దయాహృదయా!

గీ. వపువు, వాక్కులు, విద్యయు ♦ వఱలుచుండి
కరము వినయంబు గల్గి వ♦కారపంచ
కమునఁ గలిగిన వస్త్రంబు ♦ గలుగకున్న
నరుఁడు గౌరవపదవిలోఁ ♦ బరఁగు టెట్లు? 43

ఈప్రశ్నమున కనుకూలోత్తరం బొసంగఁదగిన రసజ్ఞుండ వీవని భగవంతునిచేతఁ జూపఁబడి వచ్చినాఁడను.

తుకా—పుడమిదేవా! మీప్రశ్నంబునకు సమత్తరంబు భవద్దర్శనారంభమునందే గ్రహింపఁజేసిన తమయవస్థ కెంతయు విచారించి యిట్టిసాధురూపము నాపుణ్యవశంబునఁ గాంచితిఁ గదా యని మితిలేనియానందము నిప్పటికిఁ బొందినాఁడను. (వస్త్రమును దెచ్చి) భూదేవా! దీనితో మీరు తృప్తినొందఁ బ్రార్థితులు. (ఇచ్చును.)

మాధ—(పుచ్చికొని సంతోషముతో) భక్తశిఖామణీ!

గీ. లజ్జ లేనట్టి కులకాంత ♦ లజ్జ గలుగు
వారకాంతయుఁ గలదాని ♦ వలనఁ దృప్తిఁ
బొందునృపతియుఁ జెడునల్లు ♦ భూసురుండు
ఫలితమున సంతసింపక ♦ బాగుపడు నె? 48

కనుక శాల్మలీవృక్షంబువలె నిరర్థకు లయినధనికు లనేకు లుండినను నీవల్ల నత్యానంద మొందఁగలిగితిని.

తుకా—భూమిదేవా! సత్పురుషుల సంతోషమే నాపాలిటి పెన్నిధానమని యానందించువాఁడను.

మాధ—భక్తపుంగవా! నా కనుజ్ఞనొసంగుము వేని నివాసమున కేఁగెదను.

తుకా—చిత్తము. (నమస్కరించును.)

మాధ—ఇష్టార్థసిద్ధిరస్తు. (నిష్క్రమించును.)

[తడిబట్టతో జిజీబాయి ప్రవేశించును.]

తుకా—(సంతోషముతో) సాధ్వీ! నీవు స్నానమున కేఁగి వచ్చినంతలో శ్రీహరి కొకవస్త్ర మర్పించియుంటిని సుమా.

జిజీ—(ఆశ్చర్యముతో) నాథా! స్నానమున కేఁగుతఱి నాకట్టుబట్ట

మాత్రము విడిచియుంటిని. అదిగాక మనయింటియందు మఱి వేఱుగా బట్టలేలేవు గదా! మీరు దేని నొసంగిరి?

తుకా—(నవ్వుచు) ప్రియురాలా! నీవు విడిచియున్నవస్త్రముసే యిచ్చితిని.

జిజీ—(విచారముతో) నాథా! తడిబట్ట విడిచినపిమ్మట న న్నేమికట్టు మని తమ రది పరాధీన మొనర్చిరి?

తుకా—తరుణీమణీ! భోజనమున కొకమృత్పాత్రయుఁ గప్పుకొనుట కొకకంబళియుఁ గాక నాకుమాత్ర మేమున్నది? పనికలుగు నపుడు నీవుగూడ నీకంబళినే యుపయోగింపఁదగును గాని యావిప్రరూపముతో నేతెంచి యర్థించిన శ్రీహరి కది యర్పింప కెట్లూరకొనఁగలను? కాఁబట్టి గడచినదానిఁగూర్చి వగవఁ బనిలేదు. నీ విఁకఁ ద్వరగా వంటఁ జేయుచుండుము. నే నొకసారి శ్రీహరిమందిరంబున కేఁగివచ్చెదను.

జిజీ—అటులనే గావించెదను. త్వరగా రండు.

తుకా—ఇప్పుడే వచ్చెదను. (నిష్క్రమించును.)

జిజీ—అయ్యో! భర్తయందైన భక్తిప్రేమలకొలఁది త్వరగా రండని కోరియుంటినేగాని యేవస్తువులును లేనియింటిలో నే నెట్లు వంటఁ జేయఁగల్గుదును? (ఆలోచించి) భవానీకరుణయే సహాయముగా నన్నియుఁ జక్కనౌను. (వంటఁ జేయుచుండును.)

[తుకారాము ముప్వురతిథులతోఁ బ్రవేశించును.]

తుకా—ప్రియురాలా! శ్రీహరిమందిరంబునకు నే నేఁగుచుండఁగా మార్గమధ్యంబున నీముప్వురు క్షుత్పీడితులయి ప్రాణవాయువులఁ గోల్పోవున ట్లలమటచుఁ గంటఁబడినందున స్వామిదర్శనము జేయుటకన్న వీరి ప్రాణరక్షణము జేయుట ముఖ్యముగా భావించి తోడ్కొనివచ్చితిని. వంటయైనచో ముందుగా వీరి

యాఁకలిఁ దీర్చి పిమ్మట శ్రీహరిమందిరంబున కేఁగెదను.

జిజీ—నాథా! వంటయైనది. వారల నిటుఁ బంపుదురేని వడ్డనఁ జేసెదను.

తుకా—మంచిది. అయ్యా! మీ రీసందులోనుండి లోని కరిగి యాగదిలోఁ గూర్చుండి తృప్తిగా భుజించి రండు.

అతిథు—చిత్తము. (ముగ్గురు లోపలి కేఁగుదురు.)

జిజీ—(వడ్డనఁ జేసి పైకి వచ్చి) నాథా! ప్రతిదినము మీ రీవిధముగా నతిథిసత్కార మొనర్చుచున్నందున, మనకుమాత్రము సరి పోవునటుల సిద్ధపరుపఁబడెడి యల్పపదార్థము లందఱికిఁ జాల నందున,

గీ. పిల్ల లాకలి కోర్వక ♦ వివిధగతుల
బాధలను బొందుచుండ నే ♦ పగిది నేను
సైఁపఁగలదాన? నెన్నియో ♦ సారు లిట్లు
తమకుఁ దెలుపుచునుండినఁ ♦ దలఁపకుండ్రి. 49

తుకా—(నవ్వుచు) ప్రియురాలా! స్త్రీస్వభావానుక్రమం బైననీ బేల తనం బంతయు నిట్లు మాటిమాటికిఁ జూపుచుంటివేగాని,

ఉ. ఏపని యెట్లు కాఁగలదొ ♦ యేపని యేవిధిఁ గాకపోవునో
యాపని యట్లె యైచెలఁగు ♦ నాపని యవ్విధిఁ గాకపోవునం
చీపగిదిం దలంచునెడ ♦ నెవ్వరి కెన్నఁడు చింత బాధలన్
జూపఁగలేదు నిక్క మిది ♦ సూక్ష్మమతిన్ బరికించి చూచినన్. 50

అట్టి నిర్మలబుద్ధితో ధైర్యము నవలంబింపవలయు; నట్టి తఱి మన కా శ్రీహరియే సహాయుండై యన్నియుఁ జక్కపఱుపఁగలఁడు.

అతిథు—(భుజించి పైకి వచ్చి) మహాత్మా! మీవధూవరదివ్యానుగ్రహంబున మూఁడుదినములనుండి యాఁకలితో మండుచుండెడి గర్భబాధవలన విముక్తులమై యనంతసౌఖ్యంబున నోలలాడుచు

మఱివారము దినములయిన క్షుద్బాధాలేశం బేని గలుగనివారమై యుండఁగలము. సెలవొసఁగిన మాత్రోవఁబట్టి మే మిఁక నేఁగెదము.

తుకా—అయ్యా! నిరాధారులై మీ కిట్టిబాధ గలిగినపుడెల్ల మా యథాశక్తి సత్కారములతో సుఖింపుచుండుఁడు. పోండు.

అతిధు—చిత్తము. (నిష్క్రమించెదరు.)

జిజీ—నాథా! లోపలిపనులఁ జక్కపఱచుకొని వచ్చెదను. (నిష్క్రమించును.)

తుకా—మంచిది. (సంతోషముతో) శ్రీహరిధ్యానంబున బ్రహ్మానందసముద్రతరంగంబులఁ దేలియాడుట కవకాశంబు గలిగెను.

శా. శ్రీరాధాధరబింబచుంబనశుక♦శ్రేష్ఠా! రమాసంయుతా!
పారావారగభీర! ధీర! గిరిజా♦పారాయణోన్నామకా!
నీరేజేక్షణ! శేషభూషహిత! వాణీనాథదిక్పాలవం
ద్యా! రాత్రించరసంగభంగ నిను నే♦నత్యంతము న్నమ్మితిన్. 51

(నిశ్చలభక్తితో) నిగమాంతవేద్యా! నిరుపమానరూపా! నీలనీరదనిభాంగా! పతితపావనా! పరమపురుషా! సర్వలోకోద్ధారకా! గర్భగోళాంతరస్థితచతుర్దశభువనా! గరుడవాహనా! గజప్రాణావనా! కమలాక్షా! కరుణామయా! కనకాంబరధరా! ఆపదోద్ధారకా! అక్షయస్వరూపా! అమలాత్మా! విమలచారిత్రా! విశ్వరూపా! విబుధవంద్యా! హతశాత్రవ! హారదనుర్భంగ! హరే! (మైమఱచి నిద్రించును.

[శ్రీహరి నామదేవసహితముగాఁ బ్రసన్నుఁడై.]

పరమభాగవతా!

గీ. నాదు ప్రియభక్తుఁ డైనట్టి♦నామదేవుఁ
డమితభక్తిని నాయందు♦నానుకొల్పి

గ్రంథ మొకకొంత రచియించి ♦ కడమదానిఁ
బూర్తిఁ జేయంగఁజాలక ♦ పోయె నపుడు. 52

ఉ. కావున నేఁటి కాకొదువ ♦ గ్రంథము నెంతయు నిర్మలాత్మతో
నీవు వహించి లోకులకు ♦ నిక్కపుభక్తిపథంబులోని స
ద్భావములెల్లఁ దేటపడు ♦ దారినిబట్టి రచింపు మయ్య! మో
దావహ మైనజ్ఞానమును ♦ దద్దయు నీకు నొసంగితి న్గృపన్. 53

క. ఈసత్కార్య మొనర్చిన
వాసి న్మృతజీవి వనెడి ♦ ప్రఖ్యాతియు సత్
భూసురనుతియు న్వామక
దాసత్వము జన్మశూన్య ♦ ధన్యత గలుగున్. 54

(నామదేవసహితముగా నంతర్హితుం డౌను.)

తుకా—(మేలుకొని మహానందముతో) ధన్యోస్మి. ధన్యోస్మి. పుండరీకాక్షా! నీనిర్హేతుకజాయమానానూనకటాక్షేక్షణలేశమాత్రం బైన నాయందుఁ జూపి యింతలో మేలుకొలిపి యంతర్హితుండ వైతివా? చాలు. నాభాగ్యమేభాగ్యము. పాపవంతంబు లైన యీచర్మచక్షువుల కగోచరుండవయ్యు నేఁటికి జ్ఞానేంద్రియగోచరుండవై నాస్వాంతంబు ననంతసంతోషవంతంబుగాఁ జేసినాఁడ వదియే చాలు. శ్రీకృష్ణా! తప్పక నీయాజ్ఞానుసారినై ముందుగా నీశైశవక్రీడాభివర్ణనమహాగ్రంథము నే రచించి పదంపడి నామదేవగ్రంథశేషమును బూర్తి జేసి మఱియు నీచరిత్రాత్మకం బైన యనేకగ్రంథరచనయుఁ జేసెదను. అందుల కత్యంతముఖ్యం బైననీమందిరసందర్శనమున కేఁగి వచ్చెదను. (నిష్క్రమించును.)

ఇది ద్వితీయాంకము.



శ్రీమత్పరమేశ్వరాయనమః

# భక్తతుకారాము

## తృతీయాంకము.



### ప్రథమరంగము—మార్గము.

[అన్యోన్యాభిముఖముగా గంగాధరపంతు, సంభాజియుఁ బ్రవేశించెదరు.]

గంగా—సంభాజీ! పొరుగూరునుండియే కాఁబోలు వచ్చుచుంటివి? విశేషము లేమయినను గలవా?

సంభా—గంగాధరపంతుగారూ! నాఁడుమిత్రులోఁ జెప్పి వెళ్ళినవాఁడను నేఁటికివచ్చుచుంటిని. నేఁ జెప్పఁదగిన విశేషములేమియు లేవుగాని మన గురుస్వరూపులయిన తుకారాముగారి విషయంబునఁ గల క్రొత్త విశేషములేమయినఁ గలుగునెడల సెలవిచ్చెదరా?

గంగా—భగవంతుఁడు మనకీసంఘటనమా విశేషములను ముచ్చటించుకొనుటకొఱకే కలుగఁ జేసెను. కనుకఁ గొన్ని వింతలనువినుము. అటుల దినదినాభివృద్ధినొందుచు దిగంతములవఱకు వ్యాపించి యగ్రజాతులవలనఁ గూడ నమస్కారాది పూజాగౌరవంబులఁ బడయుచుఁ బ్రఖ్యాతివహించుచుండిన మనగురువుగారి నిర్మల భక్తితత్వమునకు 'మాస్వాజి' యను సాధువు సహింపలేక మాత్సర్యపీడితుఁడై వంచింప నెంచియున్నాఁడు.

సంభా—(ఆశ్చర్యముతో) ఏమీ! వంచనప్రయత్నమునందే యుండెనా? ఎంతసాహసము! అగ్రజాతులుసైత మణఁకువ గలిగి మెలఁగుచుండ నధమజాతి కతిశయము గలిగెనేమి?

గంగా—సంభాజీ! అధమగుణంబు లధమజాతులకుఁగాక యధికులకుఁ గలుగునా? అది స్వల్పముగామాత్రము భేదించును.

సంభా—అయ్యో! వాఁడాదుస్సహాముతో దుఃఖించుచుండెనా? క్రియలచేతఁ గూడ నేమయిన జేయసమకట్టెనా?

గంగా—చూపకేమి? గతరాత్రి మనగురువుగారి గేదె వానిపూఁపుఁ దోఁటనంతయుఁ బాడుజేసినదని నేఁటియుదయ మేమేమియో వచింపరాని దుర్భాషలతోఁ దిట్టినటుల వింటిని.

సంభా—ఆదురాత్ముఁడట్టి కఠినోక్తులాడినందులకు మనగురువుగారేమైన మనోవేదన జెందిరా? ప్రత్యుత్తరంబులొసంగిరా?

గంగా—క్రియకు స్వాగతముగానైనఁ బ్రత్యుత్తరంబొసంగియుండలేదు. పరమభాగవతశిఖామణులగు గురువుగారు కూడ సామాన్యపు మెట్టవేదాంతివలె నాయాంతర్గుణంబులఁ జూపుదురా? చూపు దురేని వీరికిమాత్రి మీగౌరవంబు గల్గునా?

సంభా—సరే! గంగాధరపంతుగారూ! అడుగమఱచితిని. మనగురు వుగారిదివటిలోఁ గొన్నాళ్లొక కాఁపువాని చేను కాపరిగానుండి యందలిధాన్యమును బక్షులు మొదలయిన జీవరాసులనుబిల్చి యాహారముగా నుపయోగించినందున వాఁడానష్టమును గురు వుగారివల్ల రాఁబట్టుకొనియెనా యేమి?

గంగా—రాఁబట్టుకొనఁదలంచెనుగాని భగవంతుఁ డాసస్యమువలన వాని కధికాదాయము గలుగఁజేయుట చేత మన గురువుగారి కందువల్లను గొంత లాభకరమయి మఱి కొంద రట్టివృత్తిలో నాదరించిరి.

సంభా—అదియు సంతోషమే. ప్రస్తుతము గురువుగారి నిత్యచర్య యెట్లున్నది?

గంగా—గురువుగారి కిపు డేకాదశీవ్రత నియమ మొకటి బలిష్ఠముగా

నున్నందున వారి కానమయావశ్యక క్రియలయందు మనము
సిద్ధముగ నుండవలెను.

సంభా—సరే! మన మిఁక నివాసముల కేఁగుదము.

గంగా—మంచిది పద. (ఉభయులు నిష్క్రమించెదరు.)

ఇది విష్కంభము.

ద్వితీయరంగము—దేవాలయము.

[భక్తితత్పరుఁడైన తుకారాము ప్రవేశించును]

దేవదేవా! అనుక్షణము నీధ్యానపరిచర్యాదులయందే నామన
శ్శరీరము లుండవలయునని నేఁజేయుచున్న ప్రార్థనానుకూలముగా
నాయందనుగ్రహించి కాలచక్రము నతిత్వరగాఁద్రిప్పితివో యను
నట్లు నేఁడేకాదశియు రావించి నేఁజేయు సపర్యలఁ గొననెంచినందుల
కపారసంతోషసాగరంబున నోలలాడుచుంటిని. మఱియును,

గీ. చిత్తమున నిన్ను నిల్పుచు ♦ జిహ్వచేత
సతము నీనామకరణమున్ ♦ సలుపుచుండి
హస్తముల నీదుసేవల ♦ నలరఁజేయు
కన్నఫలమేమి జన్మకు ♦ గరుడవాహ! 55

(నలుదిక్కులు పరికించి) ఓహో! ఈ "మాన్యాజ" తనకు నాయందుఁ
గల యీర్ష్యను సాధించికొన నెంచికాఁబోలు భక్తులెల్లరు నేఁడిచ
టికి వచ్చునట్టి మార్గమని యూహింపక తనతోఁట సంరక్షణమే నిమి
త్తముగాఁ జేసికొని యీస్థల మంతయు ముండ్లతో నింపెను. ఛీ!
దుస్స్వభావమునకన్నను దోషమున్నదా? మూర్ఖు లాలోచింపక తమ దుర్గు
ణములనే జూపుచుందురు.

చ. అరయఁగ నన్నిజీవులకు ♦ నంబుజనాభుఁడె బింబరూపుఁడై
కరము సమానురాగుఁడయి ♦ కర్మముబట్టి చరింపఁజేయు చా

కరణిని గాంచుచుండునని ♦ కానఁగ లే రిల మూఢచిత్తులై
బరఁగెడి కొందఱయ్యదియె ♦ వాస్తవమంచుఁ దలంచు చెంతయున్. 56

ఇపుడు నే నీకంటక నిరోధంబులఁ దప్పింపకుండిన రాఁగల భక్తజనులకు శ్రమ గలుగఁ జేసినవాఁడ నే నగుదును. పాపకారణము నగుదును.

గీ. కూపగతుఁడైన వానిపైఁ ♦ గూర్మిగల్గి
యొద్దునకుఁ జేర్చ పుణ్యంబు ♦ నొందునట్లు
లోకని దుష్కార్యమును గాంచి ♦ యుపశమింపఁ
జేయకుండినఁ బాపంబు ♦ జెందుఁగాదె. 57

కాక నా కీసేవకావృత్తియే ముఖ్యాచరణీయము.

(ముండ్లుతీసి వేయుచు దారి బాగుచేయును).

మాంబాజీ—(ప్రవేశించి తనలో) చిరకాలమయి నన్యసించి మఠము స్థాపించికొని ప్రజలకు నాకన్న ఘనుఁ డన్యుఁడు లేఁడనెడి విశ్వాసము గల్గించి గౌరవాస్పదముగా దినములుగడపుచు నాకుఁ దోఁచినంతవఱకు మంచియో చెడ్డయో వెల్లడించుచుండ నింతలో నిన్న మొన్నఁ గన్ను దెఱచి తానొక మహాభక్తుండననెడి గర్వాంధతఁ గలుగఁ జేసికొని, ‘ నేనే దైవంబు ’ ననెడి దృఢవిశ్వాసముతోఁ దిరుగుచుండెడి నాశిష్యసమితి కెల్లఁ గల్లబొల్లులనల్లి పదే పదే బోధించి క్రియ కిప్పటికి నాకొక శిష్యునైన లేనట్టుగాఁ జేసి తనప్రభావము నాతటఁ జాటుకొనుచు నున్నతదశకు వచ్చుచుండిన కులాధముండగు తుకారాముని గర్వంబెల్ల నేఁటికి నిర్వహింపఁ దగినయదను సమకూడినది. (కోపముతో) కాకున్న నీయధముం డింత నిర్భయుండై తోఁటసంరక్షణార్థము నేఁ బెట్టిన ముండ్లకంచినంతయు నెట్లు పెకలించిపార వేసెనో? ఎంతసాహసము ? ఈకుచ్ఛితున కీస్వతంత్రమెవరిచ్చిరని స్వాధికారివలె నీకార్యమొనర్చెను? ఇదే గర్వభంగమొనర్చెదను.

(ప్రకాశముగా)

శా. ఓరీ! మూఢ! మదీయమౌ వనములో ♦ నున్నట్టి పూమొక్కలన్
క్రూరస్వాంతుఁడవౌచు నీమహిషిచేఁ ♦ గూలించుటేగాక నీ
ధీరత్వంబును జూపు చీమయుఁగుడుం ♦ దీయంగ నుంకించు ని
స్సారాత్ము న్ననుఁ బట్టి కొట్టినను దో♦షంబేల నజ్ఞానురా. 58

గీ. అధమజాతిని బుట్టి నీ ♦ వట్టులుండఁ
జాల కీర్తి మాబోఁటి ♦ సజ్జనావ
తంసములంతోడఁ బోరఁగా ♦ దలఁచుటెల్లఁ
గొఱివి చేఁబూని తల గోఁకు ♦ కొనుట గాదె? 59

గర్వాంధుండవై యొనర్చిన నీదుష్కార్యమున కిదియే శిక్ష. (ముండ్ల కంచితో వీఁపుమీఁదఁ గొట్టి) మూఢా! కులాధమా! నీకుం దగినటుల గర్వభంగముం గావించితినిఁక ననుభవింపుము. (నిష్క్రమించును).

తుకా—(తనలో) హా! పుండరీకాక్షా! నేఁటి కెట్టియవస్థ సంభవింపఁ జేసితివి? నే నెట్టి యపరాధం బొనర్చియుంటినని యో నాకీ కఠిన శిక్ష విధించితివి.

మ. దురితస్వాంతప్రమత్తులై మెలఁగు నా ♦ ద్రోహాత్ములం గూడు ధీ
వరులౌ సజ్జన చిత్తశాంతములకున్ ♦ భంగంబు వాటిల్లు నం
చరయం గల్గుట కిట్టి శిక్ష వెస నా ♦ యందున్ దయంజూపితో
పరమాత్మా! యిఁక నెన్నఁ డిట్టి పనులన్ ♦ భావింపకుందు న్గదే.

క. ధరపైఁ బుట్టువునొందిన
నరులెల్లరు నీదు దివ్య ♦ నామస్మరణన్
నిరతముఁ జేయుచు మెలఁగఁగఁ
గరుణింపుచుఁ బ్రోవుమయ్య ♦ కంజాక్ష! దయన్. 61

గీ. నీదు ప్రతిబింబరూపమై ♦ నెగడునట్టి
యఖిల జీవులయెడఁ బ్రేమ ♦ నలరఁ జూపి

ప్రోచువాఁడవు నీవెగా ♦ పుండరీక
నయన! కరుణామయాత్మ! సన్నామచరిత!
శ్రీహరీ! నా కిఁక నాజ్ఞ నొసఁగుము. (నిష్క్రమించును.) 62

తృతీయరంగము—గృహము.

[జిజీబాయి ప్రవేశించును.]

(విచారముతో) హా! భవాని! నాప్రాణనాథుఁ డీదిన మింటి నుండి బయలుదేరినది మొదలు నాయాత్మ కెందువల్లనో గాని స్థిమిత మనునది లేక యొకేవిధముగాఁ బరితాపము గలుగుచున్నది. కారణ మేమయియుండును? (యోచించి) అకటా!

సీ. నానాథుఁ డల "భాస్కరనాథ" భూధరవాసి
యైకట్టఁ బడనట్టి ♦ యప్పుడైన
పరుఁ డీర్ష్యగల్గి "యంబానాథ" కుధరాగ్రి
మందుండి రానట్టి ♦ యప్పుడైన
భర్త యొకప్పుడా ♦ "భాండూరు" పర్వతా
యత్తుఁడై చరియించు ♦ నప్పుడైనఁ
బతి దూరదేశముల్ ♦ వాణిజ్యమున కేఁగు
చాలస్య మొనరించు ♦ నప్పుడైన
గీ. నాదు మదిలేని బాధ యీనాఁడు గలిగెఁ
గారణం బింకు కేదియుఁ ♦ గానరాదు
మనసు పరితాపమగ్నమై ♦ మంచిచెడ్డ
లరయనివ్వదు ననుఁ గావు ♦ మగజ! వేగ. 63

[తుకారాము ప్రవేశించును.]

జిజీ—(సంతోషముతో) నాథా! నేఁడుత్తమ రాకయం దింతటి యా లస్య కారణం బేమి? ఎన్నఁడు లేని పరితాపము గూడ నేఁడు

నామనంబున నేల రక్షింపవలెనుగ తమ కన్నివిధంబుల క్షేమమేగదా ?

తుకా—ప్రియురాలా! దుర్మతివల్ల సజ్జనమనశ్శాంతి దూరీకృతంబగునను విషయంబును గ్రహింపఁగుడుటకుఁగా నా శ్రీహరి ప్రేరితంబైన శిక్షను బొంది యీపట్టి కార్యం బెన్నఁడొనర్ప నట్టి పరమజ్ఞానంబు గలిగి వచ్చుటచే నీదిన మీ యాలస్య మైనది.

జిజీ—(నాథుని శరీరమును బరికించి దుఃఖముతో) అయ్యో! నాథా! ఇదియేమిపాపము? గుమ్మము దగనంతలో నెట్టి దుశ్శకునమైనదో గాని నీవుపై నీ కంటకములన్నియు విరిగియున్న వేమి? ఏ పాపాత్ముని కిట్టి దుర్బుద్ధి పుట్టినది?

గీ. పరులు బొందెడి యాపదల్ ♦ భావమందుఁ
దలఁచి కాపాడి శుశ్రూష ♦ సలుపఁజేయు
నట్టి యత్యుత్తమాత్ములై ♦ నలరు మిమ్ము
నెవ్వఁడివ్విధి బాధించె ♦ హీనుఁడౌచు. 64

(వీఁపునఁ గల ముండ్లను దీయును.)

తుకా—ప్రియురాలా! మాటిమాటికిఁ బరులనుగూర్చి యీవిధముగాఁ బరుషోక్తులఁ బలుకుచుండుట నీకు హితవుగాదు. ప్రపంచమంతయు శ్రీహరి మయంబైనదగుటవల్ల మన కెంతయుఁ బూజనీయము. కాఁబట్టి తత్ప్రసంగ మిఁక కట్టిపెట్టి మనకు ముఖ్యాచరణీయంబైన యేకాదశీ భజన సమయంబు గాన స్నానాదులం గానఁ దత్సన్నాహములమై యుండుట సమంజసము.

జిజీ—అయ్యో! నాథా! మీ శరీరావస్థను బట్టి కలిగెడి యీదుఃఖ సమయమునందుఁగూడ మనశ్శాంతియే యలంకారముగా భావించెడి మీచిత్తవృత్తి కెంతయు నాశ్చర్య మొందుచుంటిని,

క. వరునిం గూడెడి వేళలఁ
దరుణికి నిర్లజ్జ నగరఁ ♦ దన రెడిభంగిఁ
బురుషుని కగౌరవం బగు
తరుణంబున కాద్రిగుణము ♦ తగుఁగాదె భువిన్. 65

తుకా—(నవ్వుచు) ప్రియురాలా! నీయభిప్రాయము కేవల మైహికాభిలాషు లంగీకరింపఁ దగినదిగాని మావృశులు విశ్వసింప రాదు. ఏమంటివేని,

క. తనభక్త చిత్తవృత్తిని
గనుఁగొనఁగా నాత్మ నెంచి ♦ కష్టాంబుధిలో
ననయము ముంచుచుఁ దేల్చుచు
వనజాక్షుఁడు ముదముతోడఁ ♦ బరికించుఁగదే. 66

అటుల నేఁటి నాకష్టదశయు నాశ్రీహరికృతముగాని యన్యము గాదు. కనుక నీవు వ్యర్థముగాఁ బరుల దూషింపకుము. (ముందుకుఁ జూచి) ఓహో! భక్తులందఱువచ్చుచుండిరే.

[కొందఱు భక్తులతో శిష్యులు ప్రవేశించెదరు.]

శిష్యు—గురుచంద్రా! నమస్కారము. (నమస్కరించెదరు).

భక్తు—మహాభాగవతా! నమస్కారము. (నమస్కరించెదరు).

తుకా—(ప్రతినమస్కారమొనర్చి) అయ్యా! గంగాధరపంతుగారూ! మన యేకాదశీసంకీర్తన వేళకావచ్చెను. భక్తులుగూడ వచ్చుచుండిరి. వీరలందఱికన్న ముందువచ్చి సిద్ధముగా నుండెడి మాస్వామిమాత్రి మీదిన మింకను రాఁడాయెను గనుక మీయుభయులు నచటికేఁగి వానిఁ దోడ్కొనిరండు.

గంగా—చిత్తము. (తనలో) ఓహో! భగవంతుఁ డిట్టి శాంతమూర్తి యందుఁ గాక యింకెవరియందుఁ బ్రసన్నచిత్తుం డౌను? (నిష్క్రమింతురు).

[మఱికొందఱు భక్తులు ప్రవేశించెదరు].

తుకా—ఆర్యులారా! మీరందఱు నాయాస్థానంబుల నాసీనులై శ్రీహరివారిని మీమనంబునఁ బ్రవేశపెట్టి యారాధింపు చుండుఁడు.

భక్తు—చిత్తము. (భగవంతునిఁ జింతించెదరు).

సంభా—(ప్రవేశించి) గురుచంద్రా! తమయానతిని శిరసావహించి మాస్వాజీవద్ద కేఁగివచ్చితిమి.

తుకా—విశేష మేమయినఁ గలదా? వచ్చుచుండెనా?

గంగా—విపరీతవర్తనులకు విశేషముండకుండునా? నేఁడేమో యతని కవయవంబులన్నియు నొప్పిగా నున్నందున రాఁజాలననెను.

తుకా—అటులయిన మీ రీయుత్తరమాయనకుఁ జూపి నిర్బాధితుండగు నంతనే తోడ్కొనిరండు (ఉత్తరమువ్రాసి యిచ్చును).

సంభా—చిత్తము. (పుచ్చుకొని నిష్క్రమించెదరు).

భక్తులలో నొకఁడు-భక్తశిఖామణీ! మాస్వాజి మీయందెంతయుఁ గపటమైత్రింజూపుచుఁ గ్రియకుఁ దనమూర్ఖమంతయుఁ జూపియుండె నట్టివాని మీ రెందుల కింత శ్రద్ధతో రావింపుచుండిరో దయయుంచి వచింపఁ బ్రార్థితులు.

తుకా—(నవ్వుచు) భక్తులారా! అజ్ఞానియై యతఁడు తనమూర్ఖమును జూపినంతనే నే నతనిశత్రువుగా భావింపఁదగునా? సర్వము దైవ స్వరూపమనెడి శుద్ధాత్ముండగు జ్ఞాని సర్వప్రియుండై సర్వదా సంచరింపఁగలవాఁడు.

భక్తు—మహాత్మా! యీతని కేమరా శాదుర్గుణదురాచారదుశ్శీలుండైన మెట్టవేదాంతియొక్కయో సంపర్కదోషబలంబు గలిగి యటులఁ బ్రశ్నించెను.

తుకా—అంతటితో ముగింపకుండుట ధర్మముగాదు.

[శిష్యులతో మాన్వాజీ ప్రవేశించును.]

తుకా—(సాష్టాంగవందనం బొనర్చి) మహాత్మా!

గీ. కఠినతనమైన నాదగు ♦ కాయమందుఁ
బల్లవమువంటి మీపాదము ♦ పాణితోడఁ
గొట్టి మీ సర్వదేహంబు ♦ కోమలంబు
విడిచి వేదనతోఁ గూడె ♦ విమలచరిత. 67

అవివేకినై మీ తోఁట చుట్టును గల కంటకములను బెకలించుటయే యందుల కాదికారణము. అట్టి నాయజ్ఞానమును మన్నించి సకలశ్రేయోవంతంబైన హరినామసంకీర్తనములోని కనుగ్రహముతో నిత్యము విచ్చేయుచు నన్ను ధన్యునిఁ జేయఁ బ్రార్థితులు.

మాన్వా—(తనలో) ఓహో! శాంతమన నితనిదే గదా! ఇట్టి శాంతమే భూషణరాజమనఁబడును. లోకోపకారపరాయణుండనఁదగిన యీ నిరపరాధి నకారణముగాఁ గొట్టియుండుటవల్లనే గదా యిప్పు డితని వినయగర్భితమైన గుణరాజమునకు నమ్రుఁడనై విశేషించి లోఁబడఁ దగినవాఁడను గావలసివచ్చినది. ఛీ! కోపమే సర్వపాపములకుఁ గారణమనుటను రవంతయుఁ జింతింపనక్కఱలేదు. ఆలోచించినచో,

ఉ. శాంతమె రాజవశ్యమును ♦ శాంతమె కీర్తికి ముఖ్యహేతువున్
శాంతమె భూషణాఢ్యమును ♦ శాంతమె సర్వవశీకృతంబునున్
శాంతమె మోక్షమార్గమును ♦ శాంతమె శాత్రవగర్వభంగముల్
శాంతమె లోకపూజ్యమును ♦ శాంతవిహీనమె సర్వనాశమున్. 68

(ప్రకాశముగా) అయ్యా! మీ సద్గుణంబుల కెంతయు సంతోషితస్వాంతుఁడనై యింతటినుండియు మీశిష్యకోటిలో నన్నొకనిఁగా భావించి నాయజ్ఞానాంధకారంబునణఁచి జ్ఞానమార్గంబున ధన్యునిఁ జేయఁ బ్రార్థించుచుంటిని.

తుకా—అయ్యా! మీసౌజన్య మానందదాయకంబయ్యె. (భక్తులం
దఱిని గని) ఓ సర్వభక్తజనులారా! మీరెల్ల రేకీకృతచిత్తం
బులతో నాప్రార్థనం బాలింపుఁడు.

సీ. ధనశక్తి గని కళ♦త్రభ్రాతృపుత్రులు
మోదింతు రదిలేక ♦ మూల్గఁగలరు
ప్రాణముల్ గలదాఁక ♦ బంధువుల్ జేరెద
రవిపోవ భార్యయుఁ ♦ గవయరాదు
అర్థసంపత్తి య♦నర్థదమై సుఖ
హీనమై ప్రజఁ గల♦హింపఁ జేయుఁ
బ్రాణముల్ చామర ♦ పత్రస్థితాంబువు
గతిగాని నిశ్చల ♦ క్రమముగావు
గీ. కనుక బాల్యము నాటలఁ ♦ గలియకుండ
యౌవనం బంగనలతోడ ♦ నణఁగకుండ
వార్ధకము చింతతోడను ♦ బాయకుండ
నరసి శ్రీహరి భజియింపుఁ ♦ డనవరతము. 69

అందఱు—(గోవిందనామస్మరణ జేయుచుఁ గరతాళధ్వనులొనర్చెదరు.)

[దొంగలు ప్రవేశించెదరు.]

దొం-ప్ర—(నమస్కరించి) ఓపుణ్యపురుషా! రక్షింపుము రక్షింపుము.

[తుకారాముని శరణుజొచ్చెదరు].

తుకా—నిర్భయులై మీకుఁ గలిగిన యాపద యెద్దియో వచింపుఁడు.

దొం-ద్వి—భక్తవర్యా! కొంతకాలమునుండి కేవలము చోరవృత్తితో
జీవించుచుండిన మేము గతరాత్రిని మీపెరటిలోఁ గల గేదెను
దొంగిలించికొని పోవుచుండఁగా మార్గమధ్యంబున నాకస్మిక
ముగా మేమెన్నఁ డెఱుఁగని విపరీతభయంబు సంభవించినం
దున మే మది మీమహిమగా భావించి వెంటనే దానిందోలుకొని

వచ్చి మీకొప్పగించి మీవలన రక్షింపఁబడుచుంటిమి. కావున మాతప్పుసైఁచి కాపాడఁ బ్రార్థించుచుంటిమి.

తుకా—(నవ్వుచు) ఈమాత్రమున కింత భీతిల్లవలెనా? కావలయునేని గేదె నుచితముగా నిచ్చితిఁ దోలుకొని పొండు. దాని సహితముగా నాదొక యభిప్రాయముఁగూడ స్వీకరింపుఁడు.

దొం-తృ—మహాత్మా! సెలవీయుఁడు.

తుకా—గీ. దొంగతన మొక వ్యసనమై ♦ దురిత బాధ
నరయనివ్వారు కావున ♦ నట్టికార్య
ములను జేయంగఁ దలఁపక ♦ బుద్ధికలిగి
కష్టసంపాద్యమున బ్రతు ♦ కంగవలయు.

దొం-ప్ర—(సంతోషముతో) మహాత్మా! మీ యుపదేశము మా యజ్ఞానమనెడి చీఁకటిని బోఁగొట్టినది. మమ్ముఁగూడ నింతటినుండి మీ సేవకులుగా భావించి మాకింతవఱకుఁ గలిగిన పాపవిముక్తిఁ జేయఁ బ్రార్థించుచుంటిమి.

తుకా—సరే! మీపాలిటికి శ్రీహరియే గలఁడు. నిశ్చలబుద్ధితో నిత్య మారాధింపుచుండుఁడు.

దొంగలు—మీయాజ్ఞను శిరసావహించి మెలంగెదము.

[భక్తులలోఁ గలసి కూర్చుండెదరు.]

మాస్వా—(తనలో) ఈమహాత్ముని భక్తియనెడి తీఁగ ప్రాఁకుచు దినదినాభివృద్ధితో భక్తులనెడి పుష్పంబులఁ బూయుచు జగత్పతి నారాధించుచుండెను. ఇట్టి మహాత్మునిదయ గలుగఁజేసికొని మహాభక్తివశుండనగుటయే శ్రేయస్కరము. (ప్రకాశముగా) గురుశేఖరా! నీయనంతకరుణకుఁ బాత్రుండనై తరియించుచుంటిని. దయయుంచి నేఁటి కిఁక నాకాజ్ఞ నొసంగుము.

తుకా—పుణ్యాత్ములారా! మీరందఱు నాయందుఁ గరుణం జూపి

ప్రతి సంకీర్తనమునకు ముఖ్యముగా విచ్చేయఁ బ్రార్థితులు.
(నమస్కరించును.)

అందఱు.—(నమస్కరించి నిష్క్రమించెదరు.)

జిజీ—(విచారముతో) నాథా! మనకష్టావస్థ నంతయుఁజూచి సహింపలేని దయాహృదయు లిచ్చిన గేదెపాలువలనఁ గొంతవఱకు నాపిల్లలు సుఖంబుగా నుండఁగా నదియు సహించలేని యీదొంగ లెక్కడనుండి సంభవించిరి? సంభవించిమాత్రము వారు దాని నిచ్చివేయుమనిరా? అయాచితముగా దానిఁగూడ వారల కర్పించితిరి. ఇఁక మాకేమిగతి?

తుకా—ప్రియురాలా! అటు లయిన యెడల,

గీ. సకలజీవులఁ బుట్టించి • సాఁకుచున్న
రుక్మిణీనాథు శరణంబు • రూఢిమైన
బుద్ధితోడను నర్థింప • ముదముతోడఁ
గరము నాతఁడె మిముఁ బ్రోవఁ • గలఁడు సుమ్ము. 71

మఱియుఁ బిల్లలను బెంచుటకై నీ కింతవిచార మెందులకు? జగద్రక్షకునియందే సమస్తభారము నుంచి మెలఁగుదువేని నీ కేవిధమును బాధయుఁ గలుగదు. అదియుఁగాక సంసారసముద్రమున మునిఁగి యున్నంతవఱకు భగవంతునియందు నిర్మలభక్తి గలుగదు. నాకట్టి భక్తి లేశంబయినఁ గలుగుటవల్లనే గదా నాకెల్లరు నాప్తబంధువులై మెలంగుచుండిరి. మఱియు దూరదేశస్థులుగూడ వచ్చుచుండిరి. కనుక నీవుగూడ నిర్మలభక్తి గలదాన వగుటయే శ్రేయస్కరము.

[వృద్ధబ్రాహ్మణి ప్రవేశించును.]

తుకా—అమ్మా! నీవేమి పనిబూని వచ్చితివి?

బ్రాహ్మ—నాయనా! అన్నవస్త్రములు లేని కడుదీనురాలను. దయ గలవాఁడవై దీనులఁ గాపాడుటయందు నీపాటి పుణ్యాత్ముఁడు

మఱి లేనట్టుగా విని వచ్చినదానను గనుకఁ గట్టుకొనఁదగినది నా కొక వస్త్రదానముం జేయఁ బ్రార్థించుచుంటిని.

**తుకా**—(లోపలికేఁగి చిరుగులబట్ట నొకదానిఁ దెచ్చి) అమ్మా! ఇష్ట మయినయెడల దీనిఁ బరిగ్రహింపుము.

**బ్రాహ్మ**—(ఆనందముతోఁ బుచ్చికొని) పరమానందమును బొందితిని. నాయనా! నాకింక సెలవిమ్ము.

**తుకా**—అమ్మా! నా నమస్కారమునుకూడ గ్రహించి పొమ్ము.

**బ్రాహ్మ**—నాయనా! దీనులఁ గాపాడువాఁడవు గమ్ము.

(నిష్క్రమించును.)

**జిజీ**—(కోపముతో) నాథా! మాటుగట్టుట కిఁక నాధారము లేకుండ నేఁటి కిదియు నిచ్చివేసిరి. నన్నేమి కట్టుమనిరి?

**తుకా**—ప్రియురాలా! మనయం దారుక్మిణీకాంతుని యనుగ్రహము గలిగియే యున్నది. కనుక నీవిఁక నీయసూయను విడిచి మాటి మాటికి నాయందుఁ గోపముం జూపు చుండకుము.

[ఖండోబా ప్రవేశించును.]

**తుకా**—భూమిదేవా! నమస్కారము. (నమస్కరించును.)

**ఖండో**—సకలవాంఛాఫలసిద్ధిరస్తు

**తుకా**—ఆర్యా! ఇటుఁ గూర్చుండి మీయాశయమును దెలుప వేఁడెదను.

**ఖండో**—మహానుభావా! నీదివ్య ప్రభావము దిగంతములవఱకు వ్యాపించి యనేక మూఢాత్ములను జ్ఞానవంతులుగా నొనర్చి తరింపఁజేయు చుండెనని విని నేనుగూడ నీ మహద్దర్శనమున జన్మపావన మొందఁదలంచి వచ్చితిని.

**తుకా**—విప్రోత్తమా! అందులకై దుష్కార్యములవంక బుద్ధిని చలింప నివ్వక నిర్మలాత్మతో నా శ్రీహరిధ్యానాది సత్క్రియల యం దాసక్తి గలిగి మెలంగుటకన్న నేమికావలెను? ఇట్టి చిత్త

శుద్ధితో నా పరమపురుషుని హృదయసీమయందుఁ బ్రవేశ
పెట్టికొని తన్మయుండై తరియింపనివాఁడు గలఁడె? ఆ పుండరీ
కాక్షుం డేల నన్ను రక్షింపకుండునని నిర్మల విశ్వాసంబు
గలిగి చెడినవాఁడు పృథ్వీమండలంబున నెచ్చటఁగాని యుండఁ
గలండే? అశాశ్వత ప్రపంచంబున స్థిరరూపంబైన యా జగ
న్నాథుని యనుగ్రహంబుకన్నఁ గలదే?

**ఖండో**—(నమస్కరించి) ధన్యోఽస్మి ధన్యోఽస్మి. పుణ్యపురుషా! నీ
సదుపదేశంబు వినిన కొలఁది నా యజ్ఞానంబు నిర్మూలంబగుచు
నాచిత్తంబు పరవశంబు నొందఁ నుద్రేకించుచున్నదే.

**తుకా**—విప్రవర్యా! నిశ్చలంబైన యా జ్ఞానానందంబుతోడనే
కాలము గడపుచుండేని భక్తవశుండగు నా శ్రీహరియు సం
తోష మొందఁగలఁడు.

**ఖండో**—పుణ్యశీలా!

క. సరసిజాక్షుని శోభా
కరమహిమం దవిలి మిగులఁ • గట్టుంబడియున్
మరితక్రియలఁ జెలంగఁగఁ
దరమే మఱి యెట్టిమూర్ఖ • తతికైనధరన్. 72

పరమభాగవతశేఖామణీ! నా కిఁక సెలవొసంగుచుండేని యింటికేఁగి
సకుటుంబముగా సద్దివ్యమార్గంబున నిత్యము సంచరించెద.

**తుకా**—భూసురోత్తమా! ఈ నారికేళ ఫలమును గొనుఁడు.

**ఖండో**—మహాప్రసాదము. (పుచ్చికొని నిష్క్రమించును.)

**జిజీ**—నాథా! పుత్రికల వివాహాతరుణ మరసి వీథిలో నాడుకొను
చుండెడి ముగ్గురు మగపిల్లలను దోడ్కొనివచ్చి యేవిధముగా
నో వివాహముల జరిగింపించి విశేషమైన యాహూయకన్యా
దానఫలమును బొందిరి. ఈపై నల్లుండ్రు సత్కారాదు లెట్లు

జరిగించెదమో, మర్యాద నెట్లు కాపాడుకొందుమో తెలియ
కున్నది.

తుకా—(నవ్వు ఏ) ప్రియురాలా! ఎవ రెట్టి సత్కారముల నొనర్చినను భగవ ప్రతికొఱకే గదా! అట్టి భగవంతుఁడు మన యవస్థ గయున్నందున యథాశక్తి క్రియల కవశ్యము నానందిం పను. మఱియు నోమానినీ!

క॥ అనుకూలశక్తులై తగు
వినియోగము ననుభవాది ♦ విధులను సలుపం
గను లేనివారి నెల్ల శ
మనుఁడేకని యర్థాశిక్ష ♦ మాసక చేయుఁ. 73

మన కావిచార మక్కఱలేదు. నీవిఁక నీపనిలో నుండుము. నే శ్రీహరి మందిరంబునకేఁగి తద్భజనానంద మరందమును గ్రోలి వచ్చెదను.

(నిష్క్రమించును.)



## చతుర్థరంగము:—వీధి.



[ఖండోబా ప్రవేశించును.]

ఇపుడు నా కేకారణమువల్లనో గాని యాఁకలిబాధ విశేషము గాఁ గలుగుచున్నది. ఇట్టిసమయమున కాతుకారామొసంగిన కొబ్బరికాయకన్న మఱి నావద్ద నాధారములేనా యెను గనుక దీనినే యుపయోగించి కొనకతప్పదు. (కొబ్బరికాయ పగులఁగొట్టి యందలి రత్నాదులఁ గాంచి యద్భుతముతో) ఓహో! ఇదియేమి విశేషము? భగవంతుఁ డనుగ్రహముతో నీ యమూల్యరత్నాదుల నొసంగి యీరూపకముగా నాదరిద్రవిచ్ఛేదముఁ జేయఁదలంచెనా? అయిన నివి యిందులోని కెట్లు రాఁగలిగెను? (ఆలోచించి) సరే! వెనుక నొక ధనవం

తుండు, భగవంతుండు తనకోర్కెం దీర్చినందులకై తా సంకల్పించిన ధనమూ భగవత్ప్రియభక్తుండైన తుకారాము స్వీకరింపనందునం గొబ్బరికాయలో నదియిమిడ్చి యభేద్యముగా నీతనికి సమర్పించికొని యుండెను. నిజముగానదియే యిది. ఆహా! భగవన్మాయ గ్రహింప నలవికానిది గదా!

క. ఎప్పటి కెయ్యది యెవరికి
నొప్పుగ సమకూర్పం దలంచి ♦ యుండునొ దానిం
దప్పక యెవరికిం దెలియని
నొప్పున నాహరియ కూర్చు ♦ సుజనులు మెచ్చన్. 74

ఎప్పటి కెయ్యది యెవరిమూలముగా నెవరికిం బ్రాప్తించునదియుం దెలియనువుపడదు. ఏదియెట్లైన నాకీ మహాదృష్ట మబ్బంజేసినది కేవల మూ తుకారాముని యనూనమహిమయే యని చెప్పకతప్పదు. కనుక నింక నే నింటికేంగి యీ యమూల్యరత్నాది ప్రభావముతో సకుటుంబముగా శాశ్వతసుఖానందంబుల నొందెదను. (నిష్క్రమించును.)

గద్య. ఇది శ్రీమత్ప్రభాకర కరుణాకటాక్ష వీక్షణాగత కవితామృతరసపాత్ర, కౌండిన్యసగోత్ర, పవిత్రాపస్తంబసూత్ర, సరససాహిత్య నారాయణార్య, వేంకటశాస్త్రివ్యాయపౌత్ర, నిఖిలనిగమాంత రహస్యార్థ ప్రావీణ్య భావనారాయణ దౌహిత్ర, త్యాడీవంశ పయఃపాథోధి రాకాసోమ, సింహాచలక్షేత్ర మాహాత్మ్యాద్యనేక ప్రబంధకర్తృ, పట్టాభిరామ నామ బుధ కనిష్ఠపుత్ర, సీతాంబాగర్భశుక్తి ముక్తాఫలాయమాన, మృదుమధుర పదకవితాధురీణ సకలసుగుణగణ సన్న్యాసినారాయణ భావనారాయణ, ప్రియసహోదర, నాగేశ్వర, నారాయణేశ్వర, భాగినేయ, వేంకటార్యదాళ ద్వితీయజామాతృ, మదనమోహినీ, సనేమిరాది నాటక గ్రంథకర్తృ, శుద్ధాంధ్రనవిగ్రయాష్టావధాని బిరుదాంకిత వేంకటశాస్త్రి నామధేయ ప్రణీతంబైన భక్తి పసారప్రముఖ రసభరితంబైన భక్తతుకారామనెడి నాటకంబునం

దృతీయాంకము.



శ్రీమత్ప్రభాకరాయనమః.

# భక్తతుకారాము

## చతుర్థాంకము.



ప్రథమరంగము — సభామందిరము.

[దయానిధివర్మయు, సుజ్ఞానియు భటసహితముగాఁ బ్రవేశించెదరు.]

దయా — మిత్రమా! ప్రస్తుతము పురవిశేషము లెట్లున్నవి?

సుజ్ఞా — మహాప్రభూ! విశేషముల కేమున్నది. పురమంతయు సంపూర్ణమైన దైవభక్తితోఁ నిండియున్నది. ఏ వీధిలోఁ జూచినను హరిభజనలతోఁ బ్రతిధ్వను లెగయుచు నాబాలవృద్ధులును దన్మయులై యుండిరి.

[అంత రామేశ్వరభట్టు ప్రవేశించును.]

అందఱు — (భక్తితో నెదురేఁగ నమస్కరించి) గురుసార్వభౌమా! ఆయాసనం బధిష్ఠింపుఁడు. (చూపుదురు.)

రామే — వంశాభివృద్ధిరస్తు. సకలవాంఛాఫలసిద్ధిరస్తు. వేదోక్తపరిపూర్ణాయురస్తు. (కూర్చుండి) ప్రభుచంద్రా! సింహాసనం బధిష్ఠింపుఁడు.

దయా — (కూర్చుండి) గురుచంద్రా!

గీ. తావకీనాంఘ్రి యుగభక్తిఁ ♦ దనరు శిష్య
మాత్రి ననుఁ దన్ప భవదీయ ♦ మానసమునఁ
బ్రేమగల్గుచు వచ్చిరో ♦ వేఱుకార్య
మెఱపఁ బూనుచు వచ్చిరో ♦ యెఱుఁగ రాగ.

కావున శిష్యవాత్సల్యముతో సెలవివ్వ వేఁడుచుంటిని.

రామే — రాజేంద్రా! పరిపాలనక్రమంబునఁ గల్గుచుండెడి పురవిశే

షంబులెల్ల శ్రీపరిభువువారు చిత్తగింపుచున్నందుల కెంతయు సంతసించుచు నొకసారి దర్శింప వచ్చినాఁడను.

దయా—(తనలో) ఈయనయెద్దియో లోపంబు గనిపెట్టినట్టు లగపడు చున్నది. (ప్రకాశముగా) గురుచంద్రా! లోప మేమున్నది? ప్రస్తుతము తాము విచ్చేయకపూర్వ మదియే మాటలాడి యంతయుఁ జక్కఁగానున్నటుల వినియుంటిని.

రామే—అటులయిన నిప్పుడు జరుగుచుండెడి గ్రామవిశేషమంతయు నెవరిదిగా భావించి యానంద మొందుచుండిరి?

దయా—అంతయు గురువిశేషమనియే తలంచుచుంటిని.

రామే—(కోపముతో)అత్యంత వైపరీత్యంబైన యాశుద్ధపాషండముతో ధారణంబంతయు నేఁ జేయుచుంటిననియే భావింపుచుంటిరేమి? మంత్రివర్యా! మీరుగూడ నిటులనే విన్నవించియుండిరి గదా!

సుజ్ఞా—ఆ భేదం బేక మీముఖంబున వినఁదగియున్నది.

రామే—సరే! అటులయినచో రాజేంద్రా! సర్వము విశదపఱచె దను. దయతోఁ జిత్తగింపవలెను.

దయా—గురుచంద్రా! భక్తితో వినెద నానతీయుఁడు.

సుజ్ఞా—(తనలో) ఈవిశేషమెట్టిదో ముఖ్యముగా వినవలెను.

రామే—(తనలో) ఉన్నవానికి మఱికొన్ని విపరీతములు తోఁడుగాఁ జేర్చి చెప్పి యిప్పుడే వాని గర్వభంగ మొనర్చెదను. (ఆలోచించి) సుజనుని రక్షింపఁదలంచు సమయంబున సుగుణములనే యుపయోగించు విధముగా నాలోచించిన మొదల,

క. పరివంచన మది నెంచెడి
తిరుణంబున లేసివైనఁ ♦ దగఁగూర్చి మహా
దురితుం డంచు వచించినఁ
ద్వరలో సంకల్ప కార్య ♦ బలమానుగదే.

(ప్రకాశముగా) ప్రభుచంద్రా! శూద్రకులసంజాతుం డైన తుకారాము పేరుగల యొక శుద్ధపాషండమతస్థుఁ డత్యంత గర్వాంధుఁడై తారతమ్యం బరయక తనవిలువనైన మెఱుంగక తా నొక మహాభక్త శిఖామణియుంబోలె ముఖంబంతయు నాక్రమించి పెద్దవాని పాదరక్ష ప్రమాణంబైన పంగనామంబు వాల్చి యన్యలక్ష్యాం బిసుమంతయు నుంచక విఱ్ఱవీఁగుచు, రాజచంద్రా!

సీ. వేదమర్మంబుల ♦ వినరాని వారికిఁ
దెలుపుచు గర్వియై ♦ తిరుగుచుండెఁ
భూదేవులకు నైన ♦ బుద్ధులఁ గఱపుచు
మ్రొక్కించుకొంచును ♦ మురియుచుండె
శాస్త్రసమ్మతకార్య ♦ సంతోష మడఁగించి
చెడుమార్గములఁ ద్రోడఁ ♦ జెలఁగుచుండెఁ
బండితాగ్రణులచేఁ ♦ బడయఁగఁ దగినట్టి
సద్విధులను దానె ♦ చాటుచుండె

గీ. ధర్మవిప్లవకారుఁడై ♦ తనరుచుండెఁ
బాపసంప్రాప్తముఖ్యుఁడై ♦ పరఁగుచుండె
వంచనాయత్తచిత్తుఁడై ♦ వఱలుచుండె
శుద్ధపాషండమతమును ♦ జూపుచుండె. 77

దయా—గురుచంద్రా! గ్రామములో నది యొక విశేషముగ నే వింటిని గాని యింతటి వైపరీత్యముని యెఱుంగనైతిని.

సుజ్ఞా—(తనలో) బ్రాహ్మణజాతి వాఁడైన యీ రామేశ్వరభట్టు తన కన్య జాతి యందుఁగల దుస్సహామంతయుఁ జూపుచుండెను.

రామే—మఱియు నో ధారుణీశ్వరా!

దయా—చిత్తము. గురుచంద్రా! ఆనతీయుఁడు.

రామే—

సీ. బ్రాహ్మణ క్షత్రియ ♦ వైశ్యుల పదసేవ
విడిచి తా నన్యత ♦ వెలయుచుండె
నగ్రజాతులచేత ♦ నాచరింపంబడు
స్నాన జపంబుల ♦ సల్పుచుండె
మునిసత్తములతోడ ♦ నెనగాఁగ మదిఁ బూని
యుపవాస విధులతో ♦ నొప్పుచుండె
స్వాములవారితో ♦ సరిపోఁగ నెంచుచుఁ
గ్రొత్త మతంబులఁ ♦ గూర్చుచుండెఁ
గీ. గటకటా! పూర్వకాల మీ ♦ కరణి క్రమముఁ
దప్పినడచినవారలీ ♦ ధరణిఁ గలరె?
శూద్రులే యింతమహిమతోఁ ♦ జొక్కుచున్న
బ్రాహ్మణులమంచు మేమిఁక ♦ బ్రతుకనేల? 78

మఱియు నెన్నేని దేశోపద్రవకరములగు మహాపాపకార్యంబు లొనర్చుచు సమస్తజనులను వంచించుచుండెను. కాఁబట్టి యీ వేటనే వాని కిందగినటుల శిక్షవిధించి సాధుజీవులగు మా బ్రాహ్మణధర్మములఁ గాపాడఁ బ్రార్థితులు.

భటు—(తనలో) పైకిసాధువులు, లోపలమహాకపటులు మీజాతికన్న లేనిమాటనిజము. అందులోను, పుల్లయ్యశాస్త్రిలు కన్నను, మల్లయ్యయవధాని గొప్ప. కన్నయ్య సిద్ధాంతికన్న, చిన్నయ్య సోమయాజులుగొప్ప. అచ్చయ్య శర్మకన్న, బుచ్చయ్య భొట్లు గొప్ప. వారందరికన్న నేనుగొప్పంటే నేనుగొప్ప, అని మీలో మీరే కోమటిపెండ్లి వచ్చినదనిన సంభావనలకొఱకు దెబ్బలాడెడి మహానుభావులు. ఇతరజాతిని జూచిసహింపఁగలరా?

దయా—మంత్రివర్యా! ఎన్నఁడైనఁ గనరానివేగాక వినరానివి సైతము విననలసివచ్చినందుల కెంతయుఁ జింతింపవలసివచ్చెఁ గదా!

సుజ్ఞా—(తనలో) రాజగురువులమత మిపు డేకీకృతమై కనిపించుచు న్నందున నేనెక్కడ వికటించినఁబ్రయోజనముండదు. సర్వాం తర్యామియైన యాపరాత్పరుండే పరిశీలించుఁగాక. (ప్రకాశ ముగా) రాజేంద్రా! రక్షించుటకుఁగాని శిక్షించుటకుఁ గాని సంపూర్ణ సమర్థులయ్యు విచారింపనేల?

దయా—(కోపముతో) మిత్రమా!

మ. తనధర్మంబు పరిత్యజించి దురితోదారక్రియాలోలుఁడై
ఘనమార్గంబున సంచరించుచు భయాక్రాంతుండు గానట్టి నీ
చుని సర్వాంగము పాపముల్ గలిగి సంక్షోభాబ్ధిలో మగ్నఁదు
త్తునియల్ జేసిన నన్యు లిట్టిపనులంద్రుంగ బోవ శంకింత్రుగా. 78

ఇంతటితో గ్రహించి యథావిధిగా బ్రతుకకుండిన వారి కాశిక్ష విధిం పక తప్పదని తెలియఁజేయుచు నీక్షణమే యీగ్రామమునుండి తఱిమి వేయునట్లు గ్రామాధికారి కాజ్ఞవ్రాసి త్వరగాఁ బంపుము.

సుజ్ఞా—చిత్తము. (ఆజ్ఞవ్రాసి) సేవకా!

భటు—చిత్తము. ఏమిసెలవు?

సుజ్ఞా—నీ వీ యాజ్ఞాపత్రికను గ్రామాధికారి కిమ్ము. (ఇచ్చును.)

భటు—చిత్తము. (పుచ్చుకొని నిష్క్రమించును)

దయా—గురుచంద్రా! ఇంకేమి కర్తవ్యము?

రామే—(సంతోషముతో) ప్రభుసార్వభౌమా! కావలసినపని యైనది. ప్రభువులగువా రిట్లుచితానుచితంబు లరసి యనుగ్రహంబులోఁ బాలించుచుండినఁ గాని యగ్రజన్ముల గౌరవంబులు నిలువం గలవా? శూద్రాది నీచజాతులే యిట్లు సంకీర్తనాదికర్తలు, మతస్థాపకులు నయి ప్రవర్తించుచుండిన నిఁక బ్రాహ్మణులుం డినఁ బ్రయోజన మేమున్నది? ఎవరి కేది యర్హకృత్యమో వారది యాచరింపందగును. లేకున్న భరింపరాని యపకీర్తి కన్న

గలుగునది యుండనేరదు.

దయా—గురుచంద్రా! నాకింక మతిపురికేఁగ సెలవొసంగుఁడు.

రామే—చిత్తము. నేఁగూడ సెలవు దీసికొనెదను.

దయా—చిత్తము. మంత్రివర్యా! లెమ్ము. (అందఱు నిష్క్రమించెదరు.)

## ద్వితీయరంగము—మార్గము.

[తుకారాము విచారముతోఁ బ్రవేశించును.]

హా! పరమాత్మా! నేఁటికి నాకెట్టి యాపద వాటింపఁజేసితివి. పరశ్రేయస్సు సహింపనేరక రామేశ్వరభట్టు నిరపరాధినైన నాయందెంతటి కృత్రిమంబు వహించెను. పాపభీతి లేక యన్యాయముగా లేనిపోని దోషంబులెల్లఁ గల్పించి రాజునకుఁ దెల్పి నన్నింత దుఃఖసముద్రమున ముంచినంతమాత్రమునఁ దనకేమి ఫలించును? ఫలించుఁగాక. ఇట్టి యన్యాయార్జితమైన యైహికాపేక్షనే బొందెను గాని యింకుల కా పరంబునఁ గలుగఁ గల కష్టముల నాలోచింపఁడాయెనే, ఎవరేమి చెప్పినఁ జెప్పెదరు గాక. యథార్థమును నారాజైనఁ బరికింపవలదా? అయ్యయో!

క. ఆపన్నులొందు బాధలఁ
బాపుట ఫలమౌను గాదె ♦ పరమార్థగుణా
రోపిత సజ్జనసంపద
కీపృథివిఁ సకలగతుల ♦ నెంచినయెడలన్. 80

అట్టి పరమధర్మము నాలోచించి నాకీ బాధమాన్పి రక్షించెడి యుత్తములెవరు? (ఆలోచించి) హా! రామేశ్వరభట్టూ! నీవే నాకీ పట్టున రక్షింపందగి కన్పట్టుచుంటివి. అయినను వెళ్లి చూచెదను.

(నిష్క్రమించును.)

## తృతీయరంగము—విశ్రాంతి భవనము.

[రామేశ్వరభట్టు మొదలగు కొందఱు బ్రాహ్మణులు ప్రవేశించెదరు.]

రామే—విశ్వేశ్వరసోమయాజిగారూ! తుకారాము గర్వ మింతటితో భంగమగునా? ఇంకను దలనెత్తునా?

విశ్వే—రామేశ్వరభట్టుగారూ! "బుద్ధిజాడ్యజనితోన్మాదుల" మని మనకొక బిరుదముండిన నుండెఁగాని యొక్కొక్క విషయములో మనము చేయుచుండెడి ప్రయత్నము సాధారణముగా వ్యర్థము గానేరదు.

బ్రహ్మ—ఇంతవఱకు జరిగించిన యత్న మొకవిధమున బాగుగానే యున్నది గాని మఱియొక్క పనియు జరిగించుట మంచిదని తోఁచుచున్నది

విశ్వే—బ్రహ్మేశ్వరశాస్త్రిగారూ! ఆపని యేదియో వివరింపకున్న మాకెట్లు తెలియఁగలదు? ఆచరించుటయు నెట్లు?

బ్రహ్మ—మఱేమియుఁ గాదు వాఁ డిదివఱకు రచించి వ్యాపింపఁజేసి యుండిన యభిప్రాయములన్నియు నత్యుత్కృష్ట విషయములు గాని సామాన్యములు కావుగదా!

రామే—ఔ నందులకే మనమింత ప్రయత్నముం జేయవలసి వచ్చినది.

బ్రహ్మ—వాని నన్నిటిని ముందుగా నశింపఁజేసి పిమ్మట వానిని స్థానభ్రష్టునిఁ జేసిన బాగుగానుండునని నాకుఁ దోఁచుచున్నది.

సోమే—అటులొనర్పించిన యెడల మఱియొకచోటనైన మరల వానికీ గౌరవంబు గలుగకుండును. కనుక నదియు మంచి యభిప్రాయముని విశ్వసింపవలెను.

రామే—సోమేశ్వర సిద్ధాంతిగారూ! ఇప్పటికీ కార్యము జరిగించుటయే కృత్యాద్యవస్థ యైనది. రాజసభలో నిగ్రహించకాని

వచ్చుట సామాన్య మనుకొంటిరికాఁబోలు. అక్కడికి మంత్రి వల్ల నెట్టి యాటంకములు గలుగునో యని మిక్కిలి భయపడితిని గాని క్రియకట్టుటలో తలంచిన కార్యము నెరవేరినందులకే మనము సంతోషింపవలెను.

నారా—అయ్యా! నారాయణేశ్వరావధాని యిట్లనెనని మీరందఱు కోపించినను సరియేగాని "దురాశ దుఃఖమునకె హేతు" వనినట్లు విశేషప్రయత్నము శ్రమకుమూలము. అయిన దానితో మన స్తృప్తి జెంది యూరకొనుటయే మంచిదని నాయభిప్రాయము.

[తుకారాము ప్రవేశించి రామేశ్వరభట్టుకు నమస్కరించును.]

సోమే—(తనలో) ఏమీ? ఈగర్వాంధుఁడు వానికొక్కనికి మాత్రము నమస్కరించి యూరుకొనెను గాని యున్నవారినందఱి నాపాటివారిగాఁ దలంచి నమస్కరింపఁడాయెనే. వయసుచేతను గూడ వానికన్న నేనే పెద్దవాఁడను. ఇట్టి దుర్బుద్ధివల్లనే వానికాదైవ మట్టి యవస్థ గలుగఁజేసెను.

బ్రహ్మ—(తనలో) సరే! ఏఁడా తరువాయి యవస్థకే కాఁబోలు మరల నిచ్చటికే వచ్చినాఁడు.

తుకా—(దుఃఖముతో) ఓమహాత్మా! రామేశ్వరభట్టూ!

మ. ధరణీదేవుల దైవరూపముగ నే ♦ ధ్యానించి తత్పాద పం
కరుహంబుల్ తలఁదాల్చినిత్యమును మోక్షుంబుఁ మదిఁగోరు కిం
కరతుల్యు న్ననుఁ గూర్చి యీకరణిగాఁ ♦ గష్టప్రయత్నంబుతోఁ
జిరవాసస్థలి హీనుఁజేయఁదలఁపన్ ♦ జిత్తంబు లెట్లోర్చెనే. 81

రామే—మూర్ఖా! కేవలము నీ వా మోక్షాపేక్షయే గలవాఁడవేమి?

తుకా—(దుఃఖముతో) అయ్యో! మహాత్మా! కాకేమి?

సీ. బహుకాలమునుండి నాదు ♦ వంశప్రతిష్ఠిత
మగు దేవళముఁ బాసి ♦ యరుఁగు టెట్లు?

చిరకాలవాసమై ♦ చెలఁగెడి యిప్పుర
ముననుండె డిలుబాసి ♦ పోవు టెట్లు ?
కడుభక్తి నాయందుఁ ♦ గల్గి మెలంగెడి
భక్తసంఘంబును ♦ బాయు టెట్లు ?
మితిలేని ప్రఖ్యాతి ♦ మించి కన్పించెడి
విప్రమండలమును ♦ విడుచు టెట్లు ?
గీ. శ్రీరమానాథు నామ సం♦చింత జేయు
నెలవులను బాసి యన్యథా ♦ మెలఁగు టెట్లు ?
రక్తిముక్తియు నొసఁగు నిం♦ద్రాణిఁగాక
కొదువనదులందు భక్తితోఁ ♦ గ్రుంకు టెట్లు ? 82

రామే—(కోపముతో) తుకారామా !

గీ. జాతి కలశూద్రవంశ సం♦జాతుఁడవయి
వేదమర్మంబులెల్లను ♦ వివిధగతుల
వెల్లడించిన నీవును ♦ వినినవారు
ఘోరపాతకచయములఁ ♦ గుడువకుండ్రె. 83

తుకా—మహాత్మా !

క. హరికృపవలన న్నేనవి
విరచించితిఁగాని యన్య ♦ విధమునఁ గన నా
తరమే ? సత్యంబును మీ
ర రయరె యవియెల్ల నెట్టి ♦ యర్థయుతములో. 84

రామే—(క్రోధముతో) ఓరీ ! మూర్ఖుఁడా !

సీ. వేదశాస్త్ర పురాణ ♦ వివిధధర్మములెల్ల
హరి నిన్నుఁ జాటుమం ♦ చనియెనేమి ?
నీకవిత్వమువల్ల ♦ నిరుపమానోపదే
శములెల్ల నశియింపఁ ♦ జాలెనేమి ?

భవదీయమహిమచేఁ ♦ బ్రిజ లాత్మలో నన్య
గురువాక్యముల్ వినఁ ♦ గూడదేమి ?
శూద్రజాతిని బుట్టి ♦ చోద్యంపు మార్గంబు
లుర్వి నెన్నఁడు విని ♦ యుంటివేమి ?
గీ. కనుక నిఁక నీవు ముందుపో♦కడలు వీడి
జాతి కనుకూలమైన సం♦చారి వగుచు
మెలఁగుచుండినఁ బదుగురు ♦ మెచ్చఁగలరు
మఱియు నాయువుగల్గుచు ♦ మనఁగఁగలవు. 85

ఆవిధముగా నిష్టపడకుందువేని నీయిడుమ లడుగనక్కఱలేదు.

తుకా—(సంతోషముతో) మహాత్మా! మీయాజ్ఞ శిరసావహించితిని గాని యి దివఱకు నే రచియించికొనియున్నవానిఁగూర్చి తమ యానతి వినఁగోరుచున్నాఁడను.

బ్రహ్మ—(తనలో) ఇంతవఱకుఁ జెప్పిన విధులు బాగున్నందుల కింక వెనుక ననుకొనిన పనిగూడ నిట్లు జరిగించిన బాగుండును.

రామే—తుకారామా! నీ విదివఱకు రచించిన గ్రంథములన్నియుఁ గట్టకట్టి యింద్రాయణీనదిలో విడిచిపెట్టవలెను. అందులోని దోక ముక్కసైతము లోకులు పంచుటకు వీలుగానటుల సంపూర్తిగా నశింపఁజేయవలెను. నీ కీ రెండుపనులు ముఖ్య కర్తవ్యములుగా గ్రహించి ప్రవర్తింపుము. పొమ్ము.

తుకా—(తల్లడిల్లుచు నిష్క్రమించును.)

విశ్వే—(తనలో) బ్రహ్మేశ్వరశాస్త్ర్యభిప్రాయ మిప్పటికి నెరవేఱినది.

బ్రహ్మ—రామేశ్వర భట్టుగారూ! ప్రతికూలాభిప్రాయముతో వాదించుట కన్యుఁ డొక్కఁడైన లేనట్టి మన ముఖ్యసంఘములో నేటి కా మూర్ఖుఁడు చిక్కినందులకుఁ దగినటులఁ బంచప్రాణములఁ దోంచి కొయ్యకు శూన్యకళేబరముగఁ జేసి విడిచిపెట్టిరి.

రామే — వీనివలన మన కింతవఱకుఁ గలిగిన తలవంపులనుబట్టి హానికిఁ బ్రాయశ్చిత్త మేపాటిది ? తగుమాత్రము గనికరించి ప్రాణములతో విడిచిపెట్టితి. ఇఁకఁ దల నెత్తనే లేఁడు. ఎత్తు నేని మఱియు నొక్కఁబడును.

నారా — రామేశ్వరభట్టుగారూ ! ద్వాదశస్థానస్థితశనిగ్రహమువలె మనలఁ బీడించెడి వీనిఁగూర్చి తలంచుకొనిన పనియేమో పూర్తిగా జరిగించిరి. నల్లమంను మరభ్యాసమువల్ల నావులింత లధికమై నాకు భోజనాపేక్షఁ గలుగఁజేయుచున్నవి. కనుక క్షమించి నాకిఁక ననుజ్ఞ దయసేయుఁడు.

విశ్వే — (నవ్వుచు) నారాయణేశ్వరావధానులుగారూ ! భోజనాపేక్ష గలుగుట మీకుమాత్రమే గాదు. కాఁగలకార్యము గట్టెక్కినందున నందఱము మీవంటివార మనియే తలంపుఁడు.

(అందఱు నిష్క్రమింతురు.)



చతుర్థరంగము: — ఇంద్రాణీ నదీతీరము.



[తుకారాము విచారముతోఁ బ్రవేశించును.]

హా ! రుక్మిణీ మనోవల్లభా ! కాళీయఫణ్యాదిదుష్టగర్వభంజనా! భక్తమానసోల్లాసప్రియా! కాంచనాంబరధరా ! మకరకుండలాలంకార భూషిత కర్ణయుగళా! జగద్రక్షకా! సర్వదేవతార్చితాంఘ్రిపుండరీకా! సూర్యచంద్రనేత్రా ! మిత్రీకృతానలాక్షా ! పుణ్యచరిత్రా ! ద్రౌపదీ మానరక్షకా ! గజప్రాణావనా ! పాపనాశనా ! (దుఃఖముతో)

సీ. సంసారమునఁ గల్గు ♦ సతియు సంతతికన్న
నతిప్రేమతోఁ జూచు ♦ నద్ది యొద్ది ?
యన్నాదులను సైత ♦ మాశింపకయు సదా
ఘనసాంద్రహా శ్రిద్ధ ♦ గలది యొద్ది ?

యాచంద్రతారార్క ♦ మవనిపైఁ బ్రఖ్యాతి
నిల్పునంచును బ్రీతి ♦ నెగడు నెద్ది ?
జన్మరాహిత్యమా ♦ స్వర్గవాసము గల్గు
ననుచు నమ్మించిన ♦ యదియు నెద్ది ?

గీ. అట్టి నిర్మలభక్తి నీ ♦ యందుఁ జూపి
యమిత భవదీయ కరుణచే ♦ ననుదినంబు
ప్రేమతోఁ జెప్పినట్టి క♦విత్వమెల్ల
విడిచి బ్రతుకుట యెట్లు ? గో♦విందనేఁడు. 86

హా! మాధవా ! అతఁడంత సహింపలేకున్న నాప్రాణములనైన నడుగఁడాయెను. అవయవోత్తమంబైన నాయుత్తమాంగంబునైన బలిగాఁ గోరఁడాయెను. నావంశరత్నంబులైన పుత్రులనైన నపేక్షింపఁడాయెను. నాసతీరత్నంబు నేని యర్థింపఁడాయెను. హా ! పుండరీకాక్షా! నాయంగంబులనైనఁ గండకండలు చెండి యివ్వఁగలను గాని సర్వాతీతంబై భవదనుగ్రహప్రాప్తకవిత్వనిర్మితంబైన యస్మచ్చరితాత్మికగ్రంథంబుల నదియెట్లు సమర్పింపఁగలను ? అయ్యో ! అర్పింపకిఁక నేఁజేయునది యేమి ? కటకటా ! ఏ యాధారము లేదాయెనా? హా ! వాసుదేవా ! క్రియకు నాబ్రతుకంతయు నిర్జనాగారప్రదీప్త దీపికావిధంబయ్యెనా? (కన్ను లొత్తుకొనుచు)

గీ. గ్రంథముల్ శాశ్వతం బను ♦ కవిజనోక్తి
నాత్మ నమ్మితి నేఁటి క♦య్యదియుఁ గూడ
నెంచిచూడ నసత్యమై ♦ యెసఁగఁ జొచ్చె
నేమిసేయుదు నయ్యయో ! ♦ యిందిరేశ. 87

పరమాత్మా ! నేఁ డా కార్యంబు జేయక తప్పనిదా ? అయ్యో ! ఇంతగా దుఃఖించెడి నాకొక మాటకైనఁ గనికరంబుతోఁ బ్రత్యుత్తరం బొసంగ కుంటివేమి ? ఇట్లు నీవూరుకొనుటను బట్టి నీకిది యంగీకార

మయినటులే తోఁచుచున్నది. (గ్రంథము లోఁక ఱాతితోఁ గలియఁగట్టి పైని బట్టఁజూచి) హా ! లోకబాంధవా ! సర్వాంతర్యామీ !

క. కటికి స్వప్నమందునఁ
పించి కవిత్వ మొసఁగి ♦ కాచియు నేఁడా
యనఘాత్మ జిహ్వనిల్పుచు
నను నీపనిఁజేయఁ బంపి ♦ నాఁడవు నీవే. 88

(నదియందా కట్టను విడిచి యతిదుఃఖముతో)

వైకుంఠవాసా ! ఎన్నఁడు లేనిదుఃఖము మరువరానిమార్గముగా నాకిప్పుడుగదా ప్రాప్తింపఁజేసితివి. అయ్యో! నే నెట్లు మరువఁగలను? మరచి మాత్రమిఁక నేఁజేయునదేమి? హా! మాధవా! నాకేమిపనిగల్పించితివి? ఇంతకుఁబూర్వ మానందమువలె నిపుడు దుఃఖమునా కల్పించితివి ? (ఆలోచించి) అకటకటా! పొరపాటు. కేవలమిదియే నాకానందము.

మ. లులితోద్రేకవిపన్మహాంబునిధి క♦ల్లోలంబులం దేలు వా
రలుగారే భవదీయ సత్కృపకుఁ బా♦త్రిప్రాయు లీయుర్విలో
పల, హే! కేశవ! పాహిమామ్ తవదయా♦భా లేన, యంచాత్మని
శ్చలతన్ వేమఱునిన్నుఁ బ్రార్థనము వాం♦ఛల్ దీరఁగాఁజేయుటన్ 89

ఇట్టి యనూనపదవిం గానని కొందఱు సామాన్యులు కేవలమైహికప్రధానచిత్తులై విశేషించి యజ్ఞానప్రాప్తనిత్యాంధులై కోరఁదగని కోర్కెలఁ గోరెదరే గాని వానివల్ల నించుకయుఁ బ్రయోజనంబు లేదు.

మ. స్థిరమైయుండని యట్టిదైనదగురా♦శీభూతనిష్కాప్త దు
శ్చరితోన్మాద విశాల కల్పితమహా♦చాంచల్య గర్వాంధులౌ
పురుషాకారపశువ్రజంబునకు ని♦న్నూజింప ధ్యానింపఁగా
ధరణి న్గారణ మెన్నఁడు న్గలుగునే♦ తల్లక్ష్మి సంపూర్ణతన్. 90

హా! మధుసూదనా! నా కింకెట్టి యవస్థ లొందించెదవో గదా !

గీ. క్షణములో సంతసంబును ♦ క్షణములోనఁ
గష్టములనెల్లఁ గూర్చుచు ♦ క్షణములోనఁ

గింటఁబడియుదు దాఁగెదా ♦ క్షణములోనఁ
జాలమాయలఁ జూపెదా ♦ క్షణములోన. 91

హా! హృషీకేశా! సర్వభారము సర్వాంతర్యామివైన యనియే నమ్ముచున్నాఁడను. (నిష్క్రమించును.)

పంచమరంగము:—ఉద్యానవనము.

[శిష్యసమేతముగా రామేశ్వరభట్టు ప్రవేశించి]

శిష్యులారా! మనకు గమ్యస్థానమైన "నాగనాథక్షేత్ర" మింకను బహు దూరమునందున్నందున నీపూఁట కీ పూఁదోఁటలో నివసించి యిందలి జలాకరంబున స్నానంబొనర్చి సంధ్యావందనాద్యనుష్ఠానంబులఁ దీర్చికొనుట మంచిదని నాయభిప్రాయము. మీకుఁగూడ సమ్మతమేగదా!

శిష్య-ప్ర—గురువంద్రా! దేవరవారి యాశయమే మాకు శిరసావహనీయముగాఁ దలంచుచుంటిమి. కనుక మా కాచరణీయంబులైన కృత్యంబు లెయ్యవియో సెలవీయుఁడు.

రామే—ముందుగా (చూపుచు) నీజలాకరంబున స్నానములఁ జేయుదము రండు. (సమీపించును.)

శిష్య-ద్వి—చిత్తము. (మువ్వురు స్నానములఁ జేయుదురు)

[పకీరు ప్రవేశించును.]

పకీరు—అయ్యా! మీ రెవరు?

రామే—ముందు నీయుదంత మెట్టిదియో వచింపుము.

పకీరు—నే నీవనాధికారిని. మహమ్మదీయజాతివాఁడను. పకీరని నన్నందురు. ఇఁక మీవృత్తాంతము దెలుపుఁడు.

రామే—మ్లేచ్ఛజాతివాఁడవుగాన నీతో నిట్టి పవిత్రస్నానాదికాలములయందు విశేషముగా వ్యర్థసంభాషణముం జేయఁదగదు. కాఁబట్టి నీవిఁక నిచటినుండి దూరముగాఁ బోయినఁగాని మా

యనుష్ఠానము ... ధము గలుగును.

శిష్య—(కోపదృష్టితో) ఏదో యాలోచించుచు నింకను జటనుండిలేచి పోవేమి ? పొమ్ము పొమ్ము. త్వరగాఁ బొమ్ము.

పకీరు—అటులనా ! ఈమిడిసిపాటు గాంచినకొలఁది మీవినాశకాల మాసన్నమైనటులే తోఁచుచున్నది. (దూరమేఁగును.)

రామే—శిష్యులారా ! స్నానమొనర్చితినిగాని యంతటినుండియు నదే మివిచిత్రమోగాని నాశరీరమంతయు మంటలెత్తుచున్నది. ఇందు వల్లను బ్రపంచమేమియు నాకుఁ దోఁచకున్నది. అబ్బబ్బా ! ఏమీ ? ఈమంట విపరీతమగుచుండెనే భరించుటెట్లు ?

శిష్య-ప్ర—గురూత్తమా ! ఇంతలో నదేమిచిత్రము?

రామే—(దుఃఖముతో) అకటా ! విచిత్రమునకుఁ జిత్రమనుచుంటివా?

గీ. అనలసంతప్తమైనట్టి ♦ యంగమందుఁ
జాల మిరియంపు గుండను ♦ జల్లి పిదప
నావముద్దను మర్దించి♦నట్లు తోఁచె
నెట్లు సైఁపుదు నీబాధ ♦ కిప్పు డేను ? 92

అయ్యో ! మాటలాడరేమి ? ఉపాయమాలోచింపరేమి ?

శిష్య-ద్వి—గురువర్యా ! ఈయాకస్మికబాధకుండగిన కారణమునాకే మియుఁదోఁచదాయెను. చల్లనినీళ్లనుజల్లుమనిసెలవైనఁజల్లెదను.

శిష్య-ప్ర—ఇట్టి సమయమునందు సెలవుకొఱకెదురుచూచుచుంటివా! నీ తెలివి మఱియు సంతోషింపఁ దగియే కన్పడుచున్నది.

(చలినీళ్ళుమీఁదఁ బోయును).

రామే—అయ్యో ! అయ్యో ! నాబాధ మఱికొంత యధికమైనది. నన్నునుభవించుమని యూరక మీరిట్లుచూచెదరేమి ? నేనిఁక నెట్లు బ్రతుకఁగలను ?

శిష్య-ద్వి—(ప్రధమునితో) నీవు చలినీళ్లు పోయుటవల్లనే గురువుగారి

బాధ మతికొంత యధికమైనది. నీపాటిచేతఁ గాకయే నేనూరు
కొంటినను కొంటివి కాఁబోలు.

శిష్య-ప్ర—గురుశేఖరా! మన మీఫకీరుతో గౌరవముగా మాటలాడ
నందువల్ల నతఁడుకాని కోపించి యీబాధ గలుగఁజేసెనేమో?
వానినే శరణుజొచ్చుట మంచిది. కాఁబట్టి త్వరగాఁ బిలిచికొని
వచ్చెదను.

రామే—ఛీ! పశుప్రాయుఁడా!

గీ. అధమజాతుల కధముఁడై ♦ యలయతురక
శరణుజొచ్చుటకన్నను ♦ జావుమేలు
మనల నిత్యము బ్రోచెడి ♦ మదనజనకుఁ
డుండ నన్యుల వేఁడుట ♦ యొప్పిదంబె. 93

శిష్య-ద్వి—(ప్రథమునితో) నా కొకయాకుపసరువల్ల నిట్టిబాధలను
దగ్గించుట తెలియును. అది యీపాంతమందు దొరకునేమో
చూతము రమ్ము.

శిష్య-ప్ర—మంచిది. (ఇరువురు నిష్క్రమించెదరు).

రామే—హా! ఆపద్బాంధవా! వాసుదేవా!

మ. తనువు న్బాసెడిబాధ గల్గె, నసువుల్ ♦ దాఁటంగనుంకించె, మం
టను జెప్పంగను శక్తి జాలదిఁకఁ, గ♦ష్టం బోర్వఁగాలేను, దీ
నుని, ధైర్యంబిసుమంత లేదు కట! న♦న్నుబ్రోవరావే! జనా
ర్దన! చక్రీ! మధుసూదనా! వరద! స♦ద్దాక్షిణ్యవారాన్నిధీ.
(మూర్ఛిల్లును).

శ్రీహరి—(ప్రసన్నుఁడై) నిష్కారణముగా నీవా నిరపరాధియైన నాభ
క్తవరుం డగుతుకారాముని నానావిధశ్రమల నొందించినందున
నతనిదుఃఖమే నీకీబాధగా సంభవించినది. అన్యాయముగా సాధు
జనుల బాధించెడి పరమమూర్ఖుల కిట్టి నీగతియే ప్రాప్తింపక

తప్పను. ఇంద్రాణీనదియందు నీవర్పింపం జేసినట్టి నాచరిత్రాత్మకంబైన మద్భక్తప్రణీతగ్రంథంబు లనపాయముగా గ్రామప్రజలవలన రప్పించి యతని కందఁజేయించియుంటిని. కాఁబట్టి నీవిఁక నీ వెంటనే యాతని శరణు జొచ్చెద వేని నీ కీబాధావిముక్తి కాఁగలదు. (అంతర్ధానుఁ డగును.)

రామే—(మేలుకొని సంతోషముతో) హా! పరమేశ్వరా! దీనబంధూ! నా వెతలఁ బాపఁ గరుణించితివా! సరే! నీయాజ్ఞాప్రకార మాచరించెదను. (పరికించి) ఏరీ నాప్రియశిష్యు లెటుఁబోయిరి. (బిగ్గరగా) శిష్యులారా!

శిష్య-ప్ర—(దూరమునుండివచ్చుచు) గురుచంద్రా! వచ్చుచుంటిమి. (ప్రవేశించి) గురుశేఖరా! ఒకవిధమయిన యామపసరు కాలినందువలనఁ గలిగెడి బాధలను నివారించు నటువంటిది గనుక వాఁడనగుట చేత దానిఁ దెచ్చుటకై యేఁగియుంటిమి.

రామే—దొరకినదా?

శిష్య-ద్వి—ఎంత వెదకినను దొరకినది కాదు.

రామే—సరే! (ఉత్తరము వ్రాసి) మీరీయుత్తరము తుకారాముని కిచ్చి ప్రత్యుత్తరమును త్వరగాఁ గొనిరండు.

శిష్య-ప్ర—చిత్తము. (నిష్క్రమించెదరు).

రామే—(తనలో) ఆహా! తుకారామా! నీవింతటి మహానుభావుండవై యుంటివని యెఱుంగని పరమమూఢుండనయి యేగదా మోసపోతిని. నీశూద్రజాతిని గూర్చియే సహింపలేకపోతిని గాని నీమహిమయు, నీచిత్తశుద్ధియు, నీశాంతగుణరాజంబును, నీనిర్మలభక్తితత్వంబును మొదలైన సల్లక్షణంబులు గ్రహింపఁజాలనైతిని. కనుకనె నేఁటి కింతటి కష్టతరమైన బాధ నొందవలసి వచ్చెను.

క. పరిపూర్ణబుద్ధితో డను । బరికించియు నెప్పుడిట్టి ♦ వారలనైనన్
బరిభవమొనరించుటతన । పరమార్థపు హానిగాదె ♦ భావింపంగన్.

నావెఱ్ఱిశిష్యు లిందులకు మందుప్రయోగముగూడఁ జేయఁదలంచిరి. సరేగాని యింకువల్ల నాకొకచక్కని జ్ఞానంబుగలుగఁ గారణమయ్యెను.

క. భువినెట్టియగ్రజాత్యో । ద్భవుఁడైనను సహనమాది♦భవ్యగుణంబుల్
గవయక యైహిక,పరములు।లవమాత్రముబొందఁగాఁగ♦లండేతలపన్.

శిష్యులు—(ప్రవేశించి) గురుసార్వభౌమా ! తమయుత్తరమును జదువుకొని వాఁడల వాతఁ డీయుత్తరమిచ్చెను. (ఇచ్చెదరు).

రామే—(సంతోషముతోఁ బుచ్చికొని విప్పి)

చ. హృదయము నిర్మలంబయిన ♦ నెల్లవిరోధులు తత్సమానుల
య్యెదరు నటాట భూతతతి ♦ సిష్టగతిన్ గనుచుండి యెల్ల నీ
రదనిభగాత్రుఁ డౌహరి ని ♦ రంతర సేవల మున్గి యుండియే
కొదువయొకింత లేని యను♦కూలవిధిన్ సుఖయింపుచుండుమా. 97

(అనుపద్యముమాత్ర మందలిది చదివి)

ఆహా ! మహానుభావా ! నీసదభిప్రాయంబుగ్రహించి యిప్పటికి సుఖముగలవాఁడనై నీవాక్య మాశీర్వాదముగా భావించితిని. శిష్యులారా! మన మీక్షణమే బయలుదేరి మహానుభావుండు, పరమభాగవతశిఖామణియునగు తుకారాముని సందర్శించి కృతార్థులమై యింతటినుండి యతనిశిష్యవర్గమునఁ జేరి జన్మరాహిత్యమార్గంబుల మెలంగుదము.

శిష్య-ప్ర— (ద్వితీయునితో) మనగురువుగారి కాభగవంతుఁడే వానియందింతటిభక్తి యనురాగాదుల నింతలోఁగలుగఁజేసియుండును.

శిష్య-ద్వి—అంతకన్న నింకెవరి కిట్టిసామర్థ్యము గలుగఁ గలదు? గురుచంద్రా ! తమచిత్తానుసార మాచరింతము దయసేయుఁడు.

(అందఱు నిష్క్రమించెదరు).

ఇది చతుర్థాంకము.

శ్రీమత్ప్రభాకరాయనమః

# భక్తతుకారాము

## పంచమాంకము.

### ప్రథమరంగము—గృహము.

[తుకారాము ప్రవేశించును.]

(సంతోషముతో) పుండరీకాక్షా! ఎట్టి వారియందుఁగాని పరిమితిలేని నీమాయంజూపియే గదా యన్తము లేని కరుణఁ జూపుచుండవు ?

ఉ. ఆరయ సర్వజీవతతి ♦ కద్భుతరోగవిపద్దరిద్రముల్
గూరిచికొన్ని నాళ్ళు కడుఁ ♦ గుందఁగఁజేసిన పిమ్మటన్ గదా
కూరిమిఁ జూపు చాదరణ♦కుందగు నర్హత గల్గు వారిగా
వారలఁ జేయుచుండెదవు ♦ వారిజలోచన! దీనరక్షణా!! 98

[శిష్య సమేతముగా రామేశ్వరభట్టు ప్రవేశించును.]

తుకా—(లేచి భక్తిపూర్వకముగా నమస్కరించి) మహానుభావా! శిష్యసహితముగా క్షేమవంతులై నన్నుదరింపఁ జేయుటకే గదా విచ్చేసిరి ?

రామే—(నమస్కరించి) పుణ్యశీలా! నాసర్వగర్వముభంగమైనది. అవివేకినై నేఁజేసిన ఘోరాపచారముల కెంతయుఁ బశ్చాత్తప్తచిత్తుండనైతిని. తమలేఖంగాంచి యందలి సద్భావముల గ్రహించునంతనే ప్రభాకరకిరణ సందర్శన మాత్రంబున నంధకారంబు నశియించుభంగి నాశరీరపరితాపమే గాక యజ్ఞానతిమిరంబుగూడ నిర్మూలమైనది. మఱియు నిట్టి నీనిష్పక్షపాతశీలంబున నెందఱో తరించుచుండిరి. కావున;

క. ఘనపాప చిత్తవృత్తిని
యొనరించిన నాదుచైవు ♦ కోర్చుచుఁ గరుణన్
నను మీదరి శిష్యునిఁగాఁ
గొని జ్ఞానము గలుఁగ జేయుఁ ♦ గోరితి భక్తిన్. 99

(మరల నంగి నమస్కరించును.)

శిష్య-ప్ర—(నమస్కరించి) మహాత్మా! మమ్ములను మాత్రము విడిచి పెట్టిన మేమెట్లు తరింపఁగలము? మేము గూడ మీసేవకా వృత్తినే యవలంబించి కృతార్థుల మయ్యెదము.

తుకా—(లేవఁదీసి) రామేశ్వరభట్టుగారూ! మీసద్భావ మెంతయుఁ బ్రశంసనీయమైనది. మిగుల గమనాయాసంబు గలవారివలె మీముఖచిహ్నాలు గ్రహింపఁజేయుచున్నవి. కావున నాహరిచర్యల స్వీకరింపవేఁడెదను. (పాదసేవఁ జేయును.)

శిష్య-ద్వి—(ప్రథమునితో) ఇట్టి తఱి మన మూరకొనఁదగదు రమ్ము.

(తుకారాముని పాదసేవఁ జేయును.)

శిష్య-ప్ర—నేనుమాత్ర మూరకొందునా? (తుకారామునికే సేవఁ జేయును.)

రామే—ఓ పుణ్యాత్మా! నే నన్నిజన్మలకైన నీ సద్భావోపేతంబైన ఋణముం దీర్చికొనఁజాలను. నాకిఁక నాజ్ఞ నొసంగుము.

తుకా—ఆర్యులారా! నాప్రార్థనమును మన్నించి ప్రత్యేకాదశీసంకీర్తనమునకును ముఖ్యముగా విచ్చేయఁ గోరుచుంటిని.

ముప్వురు—తప్పక వచ్చి తరియించెదము. (నిష్క్రమించెదరు.)

[అప్పుడు మనోహరి ప్రవేశించి తనలో]

సీ. మితిలేని శృంగార ♦ మిళితాత్ములై గ్రంథ
రచనఁ దేల్చెడి బుధ♦ప్రకరమాను

సశరీరమారులై ♦ సంకల్పితంబెల్ల
ఋణములో నిచ్చు సు♦క్షేత్రమందు
లశునమాదిగ నిచ్చి ♦ వశులౌచు దాసులై
మను పీడనట్టి కో♦మట్లయందుఁ
బెంచుకుక్కలఁబోలి ♦ పంచవీడక వేఁటు
నొప్పు సహింపని ♦ శూద్రులందు
గీ. మఱియుఁగల శూద్రులందు, నా ♦ మనుని యూన
నైన, వారలు భిక్షుకై ♦ యరుగువఱకుఁ
గనికరము మోహమును లేక ♦ ధనము గాఁగి
యాశదీరక మెలఁగు వే♦శ్యాజనంబు. 100

అట్టి సకలలోకసుప్రసిద్ధంబైన వేశ్యాకులంబునఁ బుట్టి జగత్రయంబును జెప్పపాటులో మోహింపఁ జేయఁజాలిన రంభాదులను దృణీకరింపంజేయు విద్యావయోరూపంబులఁ గలదాననై, యింత వరకు ననేక నానాజాతి విటతండంబును గేవల శల్యమాత్రావశేషంబుగాఁ బీల్చి పిప్పింజేసి సంపాదించిన విశేషధనప్రముదాలననై, విశేషించి సర్వజనమనంబుల హరించు పాటవంబు గలిగి "మనోహరి" యను పేర నన్వర్థనై యున్న నాకు నేఁటి కది యెట్టి మన్మథమాయవల్లనో గాని యానవమోహనాకారుఁడైన తుకారాము మనోహరుఁడై సుమబాణ ప్రహారణంబుల కోర్వఁజాలని దానం జేయుచుండెను. ఇట్టితఱి;

మ. కవితన్ బ్రేలుచుఁగాంతయున్ స్వయముగాఁ♦గామింపఁగా నొప్పరూ
పవరుండైన మనోహరు న్గదిసి త♦ద్భావాను మోదంబుగా
న్తవనీయాద్య ప్రియోక్తులై దనరు శ♦శ్వద్విభ్రమంబుల్ సుపా
టవమొప్ప న్ననుపర్చుటల్ మిగుల శ్రే♦ష్ఠంబౌచు నొప్పు న్గదా! 101

(ఆలోచించి) నరేగాని యాలోచించిన నందించుక సందేహము దోఁచుచున్నది.

క. గతిమాంద్యము స్వరహీనము
నతిగాత్ర స్వేద భయము ♦ లమరినదా నా
మృతికిని యాచనకును భే
దత యించుక గానరాదు ♦ తథ్యంబరయన్. 102

అట్టి పరమన్యాయమును బట్టి సామాన్యముగా ధనాదికములను గూర్చి యర్థించుటయే చావువంటిది అయినను,

గీ. అధికులగువారి దరి నర్థి ♦ వ్యర్థుఁడైన
నద్దియించుక యుత్తమ♦మాచుఁ జెలఁగు
నధమజనముల దరి నర్థి ♦ యభిమతంబు
ఫలితమైనను నీచమై ♦ బరఁగుఁగాదె ? 103

ఆచావువంటి యాచన రసహీనమహాజాడ్యపీడితులచెంత నిరర్థకమే యగునేని యది కేవల మీజన్మ మృతివంటిది మాత్రమేగాక రాఁబోవు ననేకజన్మల కకాల మృత్యుసమూహ మీజన్మలోనే ఫలించిన చంద మానుగదా ! అట్టితఱి నాసంకల్ప మానస్తుహాపర సామాన్యంబునై తము గాక, సర్వప్రపంచంబుచేత రసోత్తమంబుగా నెన్నఁబడి, సకల కృత్యంబులలోఁ బ్రాముఖ్యంబుగా నాచరింపంబడెడి శృంగార రసవిష యము. అంకులతై కేవల మీపరాయత్తచిత్తుండు నాపాలిటికి శరీర మునుధరించి యరుదెంచిన విలాసమదనుండై నామనోధన పశ్యతోహ రుండ య్యెను. ఓహో ! ఏమా మనోహరరూపము !

మ. ముకమా కంతు జయంతులన్గెలిచి న♦న్మోహింపఁగాఁజేసి వే
శ్యాక మార్గంబున నాకుచిత్తము దా ♦ నొందింపఁగా నిప్డు చే
యక తద్బాహుయుగప్రబద్ధతనుగా ♦ హత్తించి యామోవి పా
నకముద్రావి యనంతసౌఖ్యనతిగా ♦ నజేయ నెంచె న్గదా. 104

సరే ! ఇఁకఁ "జల్లకువచ్చియుఁ బాత్రదాఁచిన" విధముగా నభిప్రా యంబు నంతిష్ఠముగా నుంచిన ప్రయోజనం బేమిగలదు ?

తుకా—తరుణీ! చాలసేపటినుండి యేమితలంచుచునో నీ విచటనే యుంటివి. నీపే రెయ్యది? వచ్చిన ప్రయోజనం బెద్ది? నాకుం జెప్పవేఁడితిని.

మనో—(చిఱునగవుతో) లీలామన్మథా! నే నొక వేశ్యను. నాపేరు మనోహరియని యందఱు నందురు.

తుకా—అయిన నీవిచటికి వచ్చిన కారణం బెద్ది?

మనో—కారణమున కేమున్నది. అదినీకుఁ దెలియనిది కాదు.

తుకా—అటులయిన నెందుల కడిగితిని?

మనో—అదుగఁదలఁచి యడిగితివి.

తుకా—అది నీ కెట్లు తెలియును?

మనో—నీరూపమే చెప్పుచున్నది.

తుకా—ఏమని?

మనో—కాంతానవమన్మథుండవని.

తుకా—అయినఁ బ్రయోజనం బేమి?

మనో—మన్మథునివలన స్త్రీ పురుషుల కందఱికిని బ్రయోజనము గలదు. కాంతానవమన్మథుండవైన నీవలన నాకుఁ బ్రయోజనము గలదు.

తుకా—అది యెద్ది?

మనో—లోకులకు మన్మథప్రయోజనం బెద్ది?

తుకా—సతీపత్యనురాగమై యుండును.

మనో—నాకు నీయనురాగమై యున్నది.

తుకా—నాయనురాగము లోకు లందఱియందును గలదు.

మనో—నేఁ గోరునది యైహికానురాగము.

తుకా—నేఁ జూపునది యాముష్మిక సంబంధము.

మనో—అది యప్రత్యక్షము.

తుకా—ఇది యస్థిరము.

మనో—(మందహాసముతో) అటులనా !

సీ. ధూర్జటి స్వర్గంగ ♦ తోడఁ గృష్ణుఁడు గోపి
కాతతిఁ గూడుచుఁ ♦ గ్రాల లేదె ?
యలవసిష్ఠుఁడు మద♦యంతితోడను సుర
పతి యహల్యనుగూడి ♦ పరఁగ లేదె ?
యలపరాశరుఁడు స ♦ త్యవతితో వ్యాసుండు
నంబికాదులఁ గూడి ♦ యలర లేదె ?
సవిత్రుఁడు కుంతితోఁ ♦ జంద్రుఁడు గురుభార్య
తారతోఁ గూడుచుఁ ♦ దనర లేదె ?
గీ. గాధిపుత్రుఁడు మేనకన్ ♦ గలియ లేదె ?
యీండ్రకులజాత యైనట్టి ♦ యింతినొక్క-
ముని రమించి సురాభాండ♦మున నడంగి
శివుని మహిమంబు బొందుచు ♦ జెలఁగ లేదె ? 105

వీరలందఱు జ్ఞానులా ? యజ్ఞానులా ?

తుకా—(నవ్వుచు) పడపుఁజెలీ ! ఆలోచించినచో వారలు కేవలము జ్ఞానులకు జ్ఞానులు. నజ్ఞానుల కజ్ఞానులును. అట్టి యుపమానములం దలంచి మోసపోయిన వారల ననేకుల నీభూమండలము భరింపఁజాలక పరిపరి విధంబుల దుఃఖించుచున్నదనుటం గూర్చి యించుకయు సందేహింపఁ బని లేదు. ఈవిషయము నతిశయోక్తిగా భావించువారికన్న మూఢు లుండరనియే మహాజనోక్తిగా మన్నింపుము. మఱియుఁ గొందఱి మహానుభావుల వర్ణించెద వినుము.

సీ. రాజ్యాదిభోగవి♦రక్తుఁడై పరమార్థ
చిత్తుఁడౌ గాంగేయ♦సింహుఁ డొకఁడు,

రంభోక్తి చాతుర్య♦రజ్జువుల్ ఖండించి
మహనీయుఁడౌ శుక♦మౌని యొకఁడు,
జననాదితారక♦ఘననామచింతన
సుధఁగ్రోలు నంజనీ♦సూనుఁ డొకఁడు,
బ్రహ్మచర్యవ్రత♦పరతజీవితదివ్య
నీముఁడౌ భార్గవ♦రాముఁ డొకఁడు
గీ. మఱియు నెందఱో నీవిధి ♦ మహితరీతి
పంకమును నంటకయె యందుఁ ♦ బ్రతుకునట్టి
పురుగు లన్నిటఁ గుమ్మరి♦పురుగుకరణి
బ్రకృతిసంపర్క మొందని♦వారు గలరు. 106

మనో—విలాసమన్మథా! సరే! అవసానమున కాయాముష్మికం బర యఁదగును గాని ప్రకృతానుసారముగా నాయాశయంబు నా లింపుము.

తుకా—వచింపుము.

మనో—క. చిరకాలము నుండియు నీ
దరిశనముం జేయు నాకుఁ ♦ దలఁపు ఘటింపన్
మరునాజ్ఞ మీఱఁజాలక
వరియించితి నిన్ను నేఁడు ♦ బహుప్రీత్యాత్మన్. 107

కావునఁ దప్పక నాయభిమతం బీడేర్పఁదగు రసికశిఖామణివని తిరు ద్ధిగా నమ్మినదానను. (కౌఁగిలింపఁబోవును.)

తుకా—(తప్పించికొని) తలోదరీ! త్వరితపడకుము. వస్తుభేదం బరయక యగ్నిని స్పృసించినఁ జల్లగానుండునా?
గీ. అమలశీలత నేఁ బెండ్లి ♦ యాడినట్టి
సాధ్వియొక్క తెగాక యీ ♦ జగతిఁ గల్గు

తరుణులందఱు నను గన్న తల్లితోడ
సమముగాఁ జూచుచుంటి నో సారసాక్షి ! 108

(నమస్కరించుచు) కాబట్టి యస్థిరంబైన యట్టి తుచ్ఛసౌఖ్యాపేక్షనుండి తొలంగి శాశ్వతమోక్షప్రదంబైన శ్రీహరిసేవం జేయుచుండుము. అదియే సకల శ్రేయస్కరము.

మనో—లీలామన్మథా !

క. సురుచిర రూపాదులు గల
పురుషులు దగినట్టి కాలమునఁ జిక్కని యా
కరిగమన లందఱుం ధరఁ
బరమపతివ్రతలు నాచుఁ బరగెదరు గదా ! 109

అనెడి ద్రౌపదీవాక్యప్రమాణానుసరణముగా, సమయభేదమును బట్టి కులాంగనలకే యట్టి పరమధర్మ ముల్లంఘనీయమై కన్పట్టుచుం డుటచేత, భవదుచ్చారితచిత్తవృత్తియందుఁగూడ నసమంజసవి ధంబగుచుండఁ, బుంశ్చలినై సర్వసమానానురాగవ్యాపారార్హనైన నాయందు సైత మట్లు భావింప ధర్మముగాదు.

క. మరుఁ డల తన సమ్మోహన
శర మాకర్ణాంతముగను సమకొల్పుచు నా
యురమునఁ దీవ్రతఁ గొట్టఁగఁ
బరవశనై నిన్ను వేఁడ వచ్చితి నిటకున్. 100

కాఁబట్టి నే నిఁక నాతీవ్రమన్మథబాధ కోర్వఁజాలను. కరుణించి త్వరగా నామనోరథమును దీర్పుము.

తుకా—తరుణీ! నీవు వచించిన వేశ్యలనుగూడ నేను మాతృభావము తోడనే జూచుచుంటి నింక నీప్రయత్నమును విడచు టుత్తమము.

మనో—మనోహరరూపా !

గీ. పంచశరుబాధ కోర్వని ♦ ప్రౌఢకాంత
స్వయముగా వచ్చి మోహింప ♦ వలదటంచు
సరసు లగువార లెన్నఁడు ♦ సాహసమునఁ
బలుకఁ జెవులార వింటివే ♦ వసుధయందు. 111

తుకా—(నవ్వుచు) ఓకాంతామణీ! నీవన్నయర్థంబునుబట్టి చూచిన;

గీ. భాగ్య భోగ్యప్రసక్తులై ♦ వానివలన
నపహృతం బౌచు నెప్పుడి ♦ యాత్మగల్గు
వారిచిత్తంబు మోక్షంబు ♦ గోరుచుండి
తన్మయంబయి యొప్పఁగాఁ ♦ దగిన దగున? 112

కావున నప్రస్తుతప్రసంగమునఁ బ్రయోజన ముండనేరదు.

మనో—కాంతాపరమన్మథా!

చ. సుమశరవహ్ని తప్తయయి ♦ సుక్కడి ప్రౌఢవిలాసకాంత కా
మము దగఁదీర్పలేని యొక ♦ మానుషరూపునిఁ, దాళపత్ర సం
క్రమితసువర్ణముల్ జదువఁ ♦ గల్గని వానిని గన్నతల్లి యే
క్రమమునఁ గీర్తిఁ బొందుచును ♦ రంజిలు భూవలయంబునందునన్.

తుకా—(నవ్వుచు) నీవు వచించినటులఁ గేవల శృంగారరసోపేతులు, కోరని పరకాంతాసంయోగమునైన నభిలషించి క్రియకుమాతృదేవతను మాత్రమేగాక పితృదేవతలందఱినిఁ దృప్తి జెందించెదరు. ఇఁక సద్విద్యావిహీనునిమాట వచింపనేల? నే నట్టివాండ్రిలోవాఁడను గాను. అందువలన నీ వెంతటిమోహకచాతుర్యముంజూపినను నాకు రుచింపదు. నీకు ఫలింపదు. కనుక నీకంగీకారమగు నేని నావలన గ్రహింపఁదగిన దొక్కకైవల్యమార్గముమాత్రము గలదు. ఇట్టి యనంతసౌఖ్యానందమును గోరి క్షణభంగురంబైన నీచాభిలాషనుండి విముక్తినొంది నిర్మలచిత్తవై శ్రీహరిసేవం జేయుచుండుము.

మనో—(తనలో) సమ్మితత్రియునగ్రగణ్యంబయిన నా ప్రయత్నమంతయు నీపుణ్యస్వాంతునిచెంత రవంతయుఁ బ్రయోజనంబుగాక, విశేషించి తన విశుద్ధవైరాగ్యద్రుమంబునకు దోహదతుల్యంబయ్యెను. కాదేని:

సీ. నవనీతపారిజా ♦ తవరప్రసూనంబు
లను గల్గు మృదువును ♦ గనలఁ జేసి,
ద్రాక్షామనోహర ♦ రంభాఫలంబుల
నుండు మాధుర్యంబు ♦ నురలఁ జేసి,
తూలతిలతికార ♦ సాలపల్లవములఁ
గల కోమలంబును ♦ గ్రిందుఁ జేసి,
లాక్షేంద్రగోపక ♦ కాయూపమై యొప్పు
స్నిగ్ధ గౌరవమును ♦ జెడఁగఁ జేసి,
గీ. మించుకాంతల శృంగార ♦ మించుకైనఁ
గాని ధైర్యాదినిశ్చల ♦ క్రమము గల్గి
యొప్పు సుజ్ఞాను లగువారి ♦ యుల్లములను
వశ్యమును జేసికొనఁగను ♦ వశమె జగతి ? 113

అదియుఁగాక, ప్రభాకరకిరణ సందోహవ్యాప్తివలనఁ దిరోధానమయ్యెడి తిమిరపుంజంబు భాతి, క్రమముగా నాకామాంధకారంబు గూడ నీపుణ్యాత్ముని ప్రసంగతేజంబున నంతర్ధానంబు నొందుచు సుజ్ఞానం బంకురింపఁ బ్రారంభమయ్యెను. ఓహోహో! యథార్థతత్వమును బట్టి చూచిన,

ఉ. జాతిగుణాదులం దలఁపఁ ♦ జాలక సర్వవిటవ్రజంబుతో
నీతి రసాదుల న్నిలుప ♦ నేరని వేశ్యకులంబులోన సం
జాతమునొంది నిత్యము ధ♦నంబును గోరుచు నీచకృత్యముల్
ప్రీతిని జేయు నాబ్రతుకు ♦ ప్రేతసమంబును గాంచకుండునే. 114

ఉ. ఎంతయు ఘోరనీచమగు ♦ నీదృశవృత్తిధనాదికంబులన్
సంతతమున్ హితాత్ములను ♦ జాలఁగదుఃఖముబెట్టి యవ్విఁ గొం
డంతలు గూర్చియున్ గ్రియను ♦ యౌవనమేఁగినవృద్ధకాలమం
దంతయుఁ బోయి దైన్యమును ♦ నందెడి పాపపుజాతియిద్దియే. 115

ఇట్టి మహాపాపజాతియందుఁ బుట్టి నీచవృత్తియు బుద్ధియుఁ గలదాననై యనేకుల కనేకవిధంబుల నేఁగలుగఁ జేసియున్న బాధలన్నియు నాచిత్రగుప్తుండైన సంపూర్తిగా వ్రాయఁగలిగెనో లేదో తెలియంజాలను. ఇఁక నీజ్ఞానాధారంబుతోనైన నాదురితంబుల మఱచి జన్మసాఫల్యమునొందుటమంచిది. (ప్రకాశముగా) ఓపుణ్యశీలా ! మీయుపదేశవిశేషమువల్ల నిప్పటికి నామనంబునఁ బీడించెడి దుర్వాంఛయే గాక నాజాతిననుసరించియున్నదుర్గుణంబులు సైతము నశించినవి. నాతప్పులు మన్నించినన్నిఁక నీదాసిగా భావించి జ్ఞానోపదేశంబున నుద్ధరింపఁ బ్రార్థించుచుంటిని.

తుకా—(నవ్వుచు) మానినీ ! నిర్మలాత్మగలదాననై యైహికాభిలాషనంతయు స్వప్నఫలితప్రాయముగా భావించి, భూతదయాన్వితవై, సర్వసమాభిమానవై, నిరంతర మూహరినామధ్యానామృతంబు త్రిశుద్ధాత్మతోఁ గ్రోలుచుందువేని, పరాత్పరుండానందమయుండైకృమంబున,నీజన్మరాహిత్యముం జేయఁగలండు.

మనో—పుణ్యశీలా ! నీయనంతకరుణవలన నాయజ్ఞానంబు సమూలంబుగా నశించి మన్మనం బా శ్రీహరిసేవకై త్వరితపడుచున్నది.

తుకా—ప్రత్యేకాదశియందు జరుపఁబడెడి హరినామసంకీర్తనముకు వచ్చుచుండుము. ఇఁక నీనచ్ఛీలమును విడువక పొమ్ము.

మనో—మహాప్రసాదము. (నమస్కరించి నిష్క్రమించును).

తుకా—వాసుదేవా ! భక్తమనోవిమర్శనార్థముగా నీవు కల్పించెడి మాయలు సంఖ్యాతీతంబులుగదా ! బహుతప్తపరిశోధితసు

వర్ణంబుభాతి విపత్పరంపరచేత విమర్శింపఁబడిన స్వచ్ఛచిత్తులు గదా నీదయ కర్హులు;

సీ. వాణిజ్యమున దింపి ♦ వరుసగా నెన్నియో
జేయుచు ననుఁ బరీ♦క్షించినావు
మూర్ఖుఁడై "మాస్వాజి" ♦ ముండ్లత్రోడను వీఁపు
శిథిలంబుగాఁ గొట్టఁ ♦ జేసినావు
"రామేశ్వరుని" క్రోధ ♦ రక్తిముంచుచు మత్క
విత్వ "మింద్రాణి" జే♦ర్పించినావు
కన ననర్హపువార♦కాంతచే వినరాని
వంచనోక్తులను బ♦ల్కించినావు
గీ. ఇన్నిఁటను నాకు మంచియే ♦ యిచ్చినావు
గాని, యిఁకమీఁద నేరీతిఁ ♦ గాంచఁగలవొ?
జన్మరాహిత్య మెన్నఁ డొ♦సంగఁగలవొ?
దేవకీగర్భసంజాత! ♦ దివ్యచరిత! 116

[అప్పుడు శివాజీ యుద్యోగి ప్రవేశించి]

మహాత్మా! నేను శివాజీ చక్రవర్తిగారిచే మీసన్నిధి కనుపఁబడిన వారి ముఖ్యోద్యోగిని.

**తుకా**—మిక్కిలి సంతోషము. పంపంబడిన కార్యం బెద్ది?

**ఉద్యో**—అదియు మనవిచేయుచున్నాను. మహాత్మా!

క. కైరవహితకిరణంబులఁ
గోరు చకోరములవలెను ♦ గురుతరభక్తిన్
మారాజు మిమ్ముఁగనఁ బది
సారులు దలపోసియుండె ♦ సంతోషమునన్. 117

గీ. దర్శనంబిచ్చి ప్రేమతోఁ ♦ దనను దనదు
సర్వ పరివారమును బ్రోవ ♦ సవినయముగఁ

ప్రార్థనము మన్ముఖంబునఁ ♦ బంపెఁ గాన
వచ్చి యాశయమును దీర్ప ♦ వలెను నేఁడు. 118

తుకా—(తనలో) ఓహో! మఱల భగవంతుఁ డీ విధముగా నన్నుఁ బరీక్షింపఁదలంచెనా? ఎట్టి విషమావస్థ సంభవించెను. వెళ్లినను వెళ్లకుండిన ననర్థమే వాటిల్లునట్లు, తోఁచుచుండెను. సద్వర్తనానురాగముగల రాజాహ్వానమా యతిక్రమింపరాదు. కేవల పాపకారణంబులగు రాజకృత పారితోషికము లంతకన్న స్వీకరింపరాదు. రెండును బాధింప సిద్ధపడెను. హా! కృష్ణా!

క. ఈరీతి కోర్కె లెన్నఁడు
కోరితినే? కష్టజలధిఁ ♦ గ్రుంకింతువె? ని
స్సారపు సంసారముకుఁ
దూరంబొనరింప నేఁడు ♦ దున్గాదె సదా? 119

(ఆలోచించి)

క. మానవ సంసర్గమునఁ
హానియె ప్రాప్తించుకతన ♦ నడవినడుమ ని
త్యానందజలధి మున్గుచు
నీనామస్మరణ గలిగి ♦ నెగడెదఁ గృష్ణా! 120

మఱియును,

సీ. ఛత్రచామరగజా ♦ శ్వము లెన్నఁడైనను
దోడాన పుణ్యపుఁ ♦ దోవ కెందు?
నైశ్వర్యమును గౌర ♦ వాడంబరంబులు
నాయసూయా సద ♦ నములు గావె?
యాశయు దుఃఖంబు ♦ నత్యంతమా విచా
రమును ముక్తికి శృంఖ ♦ లములు గావె?

శత్రుత్వమును మిత్ర ♦ సరణియు భేదంబు
మోక్షహేతువు లౌచు ♦ మురియఁజాలవె?
గీ. కనుక నన్నేల బాధింపఁ ♦ గడఁగినావు?
నైహికంబులఁ బంధింప ♦ న్యాయమగునె?
కనికరింపవె నీపాద ♦ కంజయుగళ
చింతనామృతపాన సంశీలు నన్ను. 121

(ఉత్తరము వ్రాసి ప్రకాశముగా) అయ్యా! మీ రీ యుత్తరమును మీ ప్రభువు కొసంగుఁడు. (ఇచ్చును.)

ఉద్యో—(పుచ్చికొని) మహాత్మా! నా కనుజ్ఞ నొసఁగుము.

తుకా—చిత్తము.

ఉద్యో—(నిష్క్రమించును.)

[అప్పుడు నలువురు త్రాగుఁబోతులు ప్రవేశించెదరు.]

ప్రథ—మహానుభావా! (నమస్కరించి) లోకమంతయు వెదకినను నీవంటి దయావంతుఁడు మఱియొకఁడు కానరాఁడయ్యెఁ గదా!

తుకా—అయ్యా! నావలనఁ గాఁదగిన కార్యం బెద్ది?

ద్వితీ—అయ్యో! సర్వసమానుండవగు నీవలనఁ గాని కార్యంబెద్దియు లేదు.

సీ. ఘనమైన సారాయి ♦ కడుఁద్రావి మాంసముల్
గారపువస్తువుల్ ♦ గరము మెక్కి
కై పెక్కి తనుఁదాను ♦ గాంచ నేరక చేయు
చెయువుల కిల సాటి ♦ చెప్పవశమె?
గంజాయి పొగయాకు ♦ గలిపి చిల్మునఁ జేర్చి
జే! రామ! యని పీల్చు ♦ చిటికలోన
మితిలేని వస్తువుల్ ♦ మ్రింగుచుఁ గనునట్టి
పరమసంతోషంబు ♦ బలుకవశమె?

గీ. నల్లమందును, మద్దత్తు, ♦ కల్లు, బంగు,
గాఁగ మొదలైన వెన్నియో ♦ గలవు గాని
కల్లుమాత్రము పైవానిఁ ♦ గలియఁగలదు
దీని కుపమింప లే దిఁక ♦ విశ్వమందు. 122

తృతీ—ఛీ! అందుఁగల విశేషము నీవేమి చెప్పఁగలిగితివి ?

గీ. ఒక్కబుడ్డెడు సారాయి ♦ గ్రుక్కమెదప
కక్కఱను ద్రాగువానితో ♦ నిక్కఘుగను
బెక్కు గోపాంగనల్ దన ♦ ప్రక్కనున్న
పక్కిరాతును బోల్పఁగాఁ ♦ జక్కనౌన ? 123

చతు—(ప్రథమునితో) ఓరీ! (చూపుచు) వానికన్న నీఁవు చెప్పఁగలిగిన విశేషమేమి.

గీ. వైరులను జంపఁగలఁ జేసి ♦ వారు మమ్ముఁ
జేరి త్రాగెడి సారాయి ♦ సిద్ధపఱచి
కోరినంతటి ధనముతోఁ ♦ గూడ నిచ్చి
పగను సాధించికొనరె? త♦ద్బలమువలన. 124

ఇట్టి పెట్టుబడిసైత మక్కఱలేని మహావ్యాపకము గలిగిన మావలె ధనమింకొకవృత్తితో సంపాదించువారు గలరా? కోటీశ్వరులమని విఱ్ఱవీఁగు వారందఱు మాగోరుతోనైనఁ బోలఁగలరా? మా యానందమేమి? మా ధైర్యమేమి? మా నిర్లక్ష్యమేమి? మాకు మేమేసాటి.

ప్రథ—నీవింకొక్క మహిమమాత్రము చెప్పకుంటివి ;

గీ. మత్తు తలకెక్కి యొక్కొక ♦ మాఱు నెట్టి
భయము లజ్జయు లేనట్టి ♦ వరుసఁ బోడఁ
బాటబాడినఁ దద్ధ్వని ♦ వసుధనల్ల
సంబరముఁ జిల్లిబోడుచుక ♦ నరుగకున్న! 125

ద్వితీ—భూమ్యాకాశములు మాత్రమే చిల్లులుబెట్టి యూరకుండునా?

వినువారి చెవులకు ములుకులై దూసిల్లి పిమ్మట నూర్ధ్వాధో భాగంబుల రంధ్రీకృతంబులఁ గావించును.

తుకా—(నవ్వుచుఁ దనలో) ఓహో! భగవంతుఁ డెన్నివిధములుగాఁ బ్రజల నాడించుచు సంతోషించుచుండెను.

తృతీ—మహాత్మా! అదిగో వినినంతమాత్రమున నీకుసైత మానంద ముగలిగినది కదా! మే మిట్టి మహాకార్యభారము ననాయాస ముగా భరించి, చరస్థిరములయిన మాయాస్తులన్నియు సాహ సముతో నిర్మూలమైవను సరిరమేయుని మెలంగుచుంటిమి. దైవ వశంబున మాకిప్పటి కేయాధారమును లభింపదాయెను. ఒక్క పూఁట యభ్యాసము దప్పిన ఘనకార్యమున కంతరాయము వాటిల్లునని సందియమునఁ గుందుచు నీ సహాయమున దీనిని నిర్విఘ్నముగా నడుపఁగోరి వచ్చితిమి.

తుకా—(తనలో) అకటకటా! ఈక్రూరకర్మము వీరలచే నెట్టెట్టి పాప కార్యంబులఁ జేయించుచుండెను. (ప్రకాశముగా) అయ్యలారా! సూరాపానము వలన మీరలు వచించినగుణములు మాత్రమే గాక;

సీ. మద్యపానాత్ముల • మది వేశ్యపైఁబోవు
వేశ్యాధనాకాంక్ష • విడువకుండు
ధనప్రేమ ద్యూతమం•దున బుద్ధి జొన్పును
ద్యూతము చోరత్వ • దోషమొసఁగుఁ
జౌర్యము భ్రష్టద•శను వేగఁగల్గించు
భ్రష్టతవలనఁ బా•పంబుగలుగుఁ
బాపంబు శమనుచే • బాధల నొందించు
బాధలు ప్రాణి దాఁ • బడయఁ గలదె?

గీ. ఇన్నిటికి మూలమగాచున ♦ నెసఁగునల్ల
మద్యపానంబు విడచుట ♦ మంచిగాదె?
విలువ వచియింపరాని యా ♦ విష్ణుభజన
కన్న సంతోషమైనది ♦ గలదె భువిని? 126

కావున నేఁ జేయునది హితోపదేశముగా భావించి యింతటినుండి మీ దురభ్యాసంబుల విడిచి నిర్మలచిత్తవ్యాపారంబు గలిగి శ్రీహరిస్మరణతోఁ గాలము గడిపెదరేని, మాటి మాటికిఁ బుట్టుట చచ్చుట మొదలైనవానితోఁ గూడిన యీ మాయాసముద్రమునుండి విముక్తి నొంది యాపరాత్పరుని దయవలన జన్మరాహిత్యంబు నొందఁగలరు.

నలువురు—(సంతోషముతో) మహానుభావా! నీవల్ల నిట్టి మహోపదేశభాగ్యంబు లభించుననియే భగవంతుఁ డూహించి నేఁటికిచటికిఁ దోడ్కొని వచ్చి మమ్ముల నొప్పగించె. నీయుపదేశవిషయంబులు గూడ మామనంబుల కెంతయు సంతోషకారణంబయ్యెను. నీయాజ్ఞ శిరసావహించెదము.

తుకా—ప్రత్యేకాదశి హరిభజనకు వచ్చి సేవ జేయుచుండుఁడు.

నలువురు—తప్పక వచ్చుచుండెదము. మా కాజ్ఞ నొసంగుము.

తుకా—మంచిది.

నలువురు—(నమస్కరించి నిష్క్రమించెదరు.)

(శివాజీ భటసహితముగాఁ బ్రవేశించి నమస్కరించి)

మహాత్మా! (మెడలో నొకపుష్పమాలికం గీలించి ధనపాత్రలువద్దనుంచి) మీ రతిప్రేమతోఁ బంపిన లేఖంగాంచి యమందానందచిత్తుండనై జ్ఞానంబుగల్గి భక్తితో మీకీ పారితోషికంబుల దోడ్కొని వచ్చితిని, శిష్యవాత్సల్యముతో నివి గ్రహింపఁ బ్రార్థితులు. (మరల నమస్కరించును.)

తుకా—(కానుకలందు నిర్లక్ష్యముం జూపుచు) రాజపుత్రా!

సీ. హరిపదధ్యానుల ♦ కల పిపీలికములు
రారాజులును నొక్క ♦ రకము సుమ్ము
నీవు కానుక నిచ్చు ♦ నిష్కముల్ మృత్తిక
స్వామిసేవకులకు ♦ సమము సుమ్ము
భక్తు లాశాపాశ♦బద్ధులు గానట్టి
గుణమును నే నేర్చి ♦ కొంటి సుమ్ము
సుజనసర్వస్వ మా ♦ గజరక్షకుం డాట
వారు సర్వైశ్వర్య ♦ వరులు సుమ్ము
గీ. తల్లియును దండ్రి వారి కా♦తండె యాట
నిరుపమానబలుల్ వారు ♦ నిజము సుమ్ము
హరి కృపాపూర్ణ సక్తులే ♦ యఖిలదేశ
ములకు సర్వాధికార ప్ర♦భువులు సుమ్ము. 127

మఱియు నోధారుణీశా !

క. బలమును దేజము ధనమును
గలవారికి రాజ్యపదవి ♦ గలుగును మఱి శ్రీ
లలనాధిప భక్తుల కవి
యలవడి రారాజుకన్న ♦ నధికులు ధరణిన్. 128

కావున నిట్టి భక్తుల సంతోషపఱుపఁ దలంతువేని భగవత్సేవాస్మరణలఁ జేయుచు నా నందనందనుని కంఠంబున కానందమయంబులైన తులసీమాలికలం దాల్చి యేకాదశీవ్రత మాచరింపుచు హరిదాసుండవై యుందువేని నాకదియ యమందానందకారణం బగును.

శివా——(సంతోషముతోఁ దనలో) ఓహో ! ఏమీ, యీపరమభాగవతోత్తముని మనోధైర్యము ? రాజాధిరాజులు సైత మితని దృష్టికిఁ జీమలవలె నత్యంతాల్పులయి తోఁచుచుందురఁట. (శిరఃకంపముతో) నిజముగా నైహికసంబంధ మించుకయు లేని

నిర్మలభక్తుల కటులఁ బోఁచుటయే ధర్మము. కనుక నే ;

గీ. విపుల జనసంఖ్యతోఁ గూడి ♦ వెలయుచుండి
ప్రథితమైనట్టి రారాజు ♦ పదవికన్నఁ
బ్రవిమల జ్ఞానవృత్తితో ♦ వఱలు నితని
భక్తియుతమైన వైరాగ్య ♦ పథము ఘనము. 129

కాఁబట్టి యిట్టి సద్విధమునఁ గాలము వెళ్లించుటయే యుత్తమ మయినందున మజ్జీవితశేష మింక నీకరణి జరిగించుకొనుట యుత్తమము. (ప్రకాశముగా) మహాత్మా! భవద్బోధామృతధారలఁ గడుపారఁ గ్రోలినందున మజ్జననాదిగాఁ గలిగియున్న యైహికవాంఛయంతయు నిర్మూలముగా నశించి పరమునం దత్యంతవిశ్వాసము గలిగినది. నాకిఁక నింతటినుండియు సారహీనంబయిన యీసంసార మహాతాపమును విడిచి వనంబున నొంటిగాఁ దపం బాచరించి ముక్తిమార్గంబున మెలంగ నానతిమ్ము.

తుకా—(నవ్వుచు) సార్వభౌమా! సామాన్యగృహస్థునివలె నీవటులఁ బలుకఁదగునా?

సీ. జలరాశియైన సం♦సారము దాఁటఁగా
నోడయై సత్కర్మ ♦ మొప్పుఁ గాదె?
యాత్మీయమైన ధ♦ర్మాచరణము కన్న
నన్యమార్గము తొరిత ♦ కవనిఁ గలదె?
శత్రుసంహారంబు ♦ సజ్జనావనము నీ
ప్రభుధర్మవిధులుగాఁ ♦ బరఁగుఁ గాదె?
స్వాంగపుష్టి ముదంబు ♦ సౌఖ్యార్థి గనునట్లు
ప్రజలకల్మి నృపాల ♦ బలము గాదె?
గీ. ప్రజ్ఞతోడను నిజప్రజా ♦ పాలనము, ని
రతము జేయుట నృపతిధ♦ర్మంబు గాదె?

సత్యనిష్ఠ జనామోద • సరసి తనది
యనుచుఁ బతి నిత్యరక్షణ • మరయవలదె ? 130

మఱియును,

మ. నరనాథుండయి యాత్మధర్మముల నన్యూనంబైనఁ బోనాడ కా
యరవిందాక్షు పదారవిందయుగళం • బాత్మన్ విలోకింపుచున్
నిరతంబున్ జనపాలనంబు సలుపన్ • నేపథ్యసంచారియా
హరి దాఁ జెంతకువచ్చి నిల్చుచుఁ బ్రస • న్నాత్ముండు గాకుండునే.

మఱియు నేఁజెప్పఁదగినవి నీవు వినఁదగినవియు ననేకధర్మంబులుగలవు. క్రమంబున నవియెల్ల గ్రహింపఁ దగును. కాఁబట్టి యిప్పటి కీముఖ్యవిషయంబు లరసి నీవానప్రస్థసంకల్పము ద్యజించి ప్రజానురాగివై ధర్మంబుదప్పక భగవదారాధనతత్పరుండవై మెలంగుచుఁ బ్రత్యేకాదశీ హరిభజనకు విచ్చేయుచుండుము.

శివా—(శిరమువంచి నమస్కరించుచు) ధన్యోస్మి. ధన్యోస్మి. మహాత్మా! నాకిఁక నాజ్ఞనొసంగుము.

తుకా—రాజేంద్రా! మంచిది నీవిఁక నీపురంబునఁ కేఁగుము.

శివా—చిత్తము. (నమస్కరించుచు నిష్క్రమించును).

(తెరపడును).

ద్వితీయరంగము—మార్గము.



[శ్రీధరశర్మ, గోపాలశర్మ యను బ్రాహ్మణు లన్యోన్యాభిముఖముగాఁ బ్రవేశించెదరు.]

శ్రీధ—అయ్యా! మీ రెచటి కేఁగుచుండిరి?

గోపా—మహాభక్తులందఱుఁ గూడి చేయుచుండెడి భగవన్నామసంకీర్తనము వినుటకై పండరిపురమున కేఁగుచుంటిని. మీ రెచటనుండి వచ్చుచుండిరి?

శ్రీధ—నేనచటినుండియే వచ్చుచుంటిని గాని మీకిట్టి సద్బుద్ధిగలిగి యు నాలస్య మొనర్చిరేమి ?

గోపా—ఏమీ! సంకీర్తనము జరుగుచుండ లేదా ?

శ్రీధ—జరుగకేమి ? అంతయు సంపూర్తియైనది.

గోపా—అకటా! నే నెంతటియపాత్రుండనైతిని. ఆర్యా! మీరలా మహావిశేషమంతయుఁ జూచియు, వినియు వచ్చినవారు గనుకఁ బూర్ణాభిలాషతోఁ గూడిన విషయముగుటచే వినుటయుఁగొంత శ్రేయస్కరము గావునఁ గనికరించి నాకావిశేషములెల్ల సెల విచ్చి ధన్యునిఁ జేయఁ బ్రార్థితులు.

శ్రీధ—(నవ్వుచు) అయ్యా! మీసదభిలాషకు సంతసించితిని గాని నే నావినోదము లన్నియుఁ జెప్పఁగలనా ?

గోపా—అయ్యా! మీకుఁ దోఁచినంతవఱకునైనఁ జెప్పి నన్నానం దింపఁ జేయక తప్పదు.

శ్రీధ—సరే! మీయభిలాషను బట్టి స్ఫురించినంతవఱకుఁ జెప్పెదను.

గోపా—నాకదియ చాలును. త్వరగాఁ జెప్పుఁడు.

శ్రీధ—అయ్యా! అచటి మహాజనులనందఱిని యథావిధిగాఁ బ్రథమదినంబున మనతుకారాము విశేషభక్తిభావప్రకటనచాతుర్య మార్గంబునఁ బరవశీకృతాత్ములఁ గావించెను.

గోపా—ఓహో! ఎట్టిపుణ్యసమయ మప్రాప్తమాయెను. తరువాత?

శ్రీధ—మఱుచటిదినంబున శివాజీచక్రవర్తికి మత్రోపాధ్యాయుఁడు నపరశ్రీశుకుఁడు నగు రామదాసస్వామి యను మహాభక్త శిఖామణి శ్రోతృజనార్థితుండయి హరికథాసంకీర్తనపాటవా డంబరమున నెల్లరియుల్లంబుల నిర్వాతప్రదేశస్థితదీపికాగ్రంబు భాతి నిశ్చలత్వంబున నేకీకృతంబుగావించి మించెను.

గోపా—నాకన్న దురదృష్టవంతు లుండనేరరు. తరువాత?

శ్రీధ—మఱునాఁ డరుణోదయంబున, మహాభక్తశిఖామణుల నేకులు, స్నాన సంధ్యావందనా ద్యనుష్ఠానంబుల, నిష్ఠాగరిష్ఠు లయి శ్రీచూర్ణ పరికల్పిత ద్వాదశోర్ధ్వ పుండ్రధారులై, బింబ ప్రతి బింబ న్యాయంబుగా మహాభక్తి ముకురంబునఁ బ్రతిఫలించి నట్టి యనేక వైష్ణవస్వరూపంబులై కన్పట్టుచుఁ, బరస్పరా విర్భూత మహానురాగంబులు బహిష్కృతంబు లౌనట్టి గాఢా లింగనంబు లొనర్చుచు, హరే! కృష్ణా! మాధవా! శ్రీధవా! అని చేయుచుండెడి హరినామ సంకీర్తన స్వనంబు కోటుల కొలఁది స్త్రీపురుషులతో నాకీర్ణంబై యొప్పెడి మహాపావాత్సవ ప్రదేశంబునఁగల భూనభోంతరాళము సర్వము విష్ణుమయం బనునట్లు ప్రతిధ్వనులతో నిండెను.

గోపా—ఓహోహో! నాపాలిటి కదియే యిదియై పరవశునిఁ జేయు చుండెను. (తన్మయానంద మభినయించి) తరువాత?

శ్రీధ—అట్టి మహానంద సమయంబున శ్రోతృ ప్రేక్షకంబున సము దాయంబుగూడ నున్మత్తభావంబున విరామశూన్యంబుగా హరినామోచ్చారణంబు గావించెను.

గోపా—అత్యంతసంతోష మయ్యెను. తరువాత?

శ్రీధ—అంత నొకభక్తశిఖామణి తన్మయంబైనభక్తి చిత్తంబున "నదే శ్రీకృష్ణుం డవతరించె" ననియు, వేఱొకం "డదే మన ముద్దు కృష్ణుండు శకటాసుర సంహారంబు గావించుచుండె" ననియు నీవిధంబుగా భక్తులందఱు శ్రీకృష్ణావతారంబున జరిగిన చర్య లన్నియు గుఱ్చి వక్కాణించుచున్నంత మన తుకారాము భక్తులసందడినిఁగాంచి యదే కురుపాండవవాహినమధ్యంబున శ్రీమన్నారాయణుండు తన విశ్వరూపంబును జూపుచుండెనని మేఘగంభీర భీషణ భాషణంబుల భాషించునంత భక్తులందఱు

తన్మయులయి యద్దాని మనోదృష్టిచే సందర్శించి జయధ్వాను లెసఁగించుతటి నున్న సమస్తజనులు సంతోషప్రవాహంబునఁ బడి ప్రేమార్ణవంబునఁ దేలిరి.

గోపా—ధన్యోస్మి ధన్యోస్మి. (పరవశుండగును.)

శ్రీధ—అయ్యా! లేచి తరువాయి వినుము. (లేవఁదీయును.)

గోపా—(తన్మయభావముతో) హా! పద్మనేత్రా! పుణ్యచరిత్రా! హైమవతీ ధవమిత్రా! రమాకళత్రా! పాపలతికాలవిత్రా! సర్వభక్తజన నమస్కారపాత్రా! మీనకేతనపుత్రా! అజ్ఞానాంధకారమిత్రా! సర్వపవిత్రా! కనిష్ఠాంగుళీయాగ్రభాగ ధారితగోవర్ధనగోత్రా! పాహిమామ్, పాహిమామ్. (మేలుకొని) అయ్యా! తరువాయి వచింపుఁడు.

శ్రీధ—అంత మఱియొకదినంబున రామదాసస్వామి శిష్యురాండ్రగు వేణుబాయి, యకాబాయి, యనువా రత్యంత మనోహరగాన చాతుర్యంబున భక్తిరసమును బ్రవహింపఁజేసిరి.

గోపా—ఓహో! ఎట్టిపుణ్యకాల మప్రాప్తమైనది? తరువాత?

శ్రీధ—అంత శివాజీ చక్రవర్తి భక్తశిఖామణుల నందఱి ననేకవిధ సత్కారంబుల గౌరవింపుచు సంఖ్యాతీతంబులగు ధనాది రాసులతోడ, నాలుగు గ్రామంబులతోడ మన తుకారాముని గౌరవింపఁ దలంచుట నతఁ డెఱింగి యవి స్వీకరింపఁదలంపులేని కారణమున నెవరికిం దెలియనట్లు రహస్యముగా నెచటికేఁగి నందువల్లనో శివాజిమిగుల విచారించుచుండుటం గాంచి రామ దాసస్వామి తుకారాముని సచ్ఛీలమును దెలుపుచు నతని దూరీకృతవిచారునిం జేసెను.

గోపా—నాకట్టివేడుక చూచెడి మహాభాగ్య మెప్పటికబ్బునో గదా?

శ్రీధ—ప్రత్యాషాఢ కార్తీక మాసములయందు జరుపఁబడుచుం

డును గాన మీకు మఱల నట్టితఱి ఫలింపఁగలదు.

గోపా—సరే! మన మిఁక నివాసంబుల కేఁగుదము రండు.

శ్రీధ—మంచిది. (ఇద్దఱు నిష్క్రమించెదరు.)

ఇది విష్కంభము.



తృతీయరంగము—గృహము.



[తుకారాము శిష్యులతోఁ బ్రవేశించును.]

తుకా—(విచారముతో) ఓహో! దేశ మెట్టిస్థితికి మాఱినది. హైందవుల కాజన్మద్వేషులై యకారణ కల్పిత కలహచిత్తములతో నీతురష్కులొనర్చెడి దుష్క్రియలఁ గాంచినకొలఁది సాధువు లిఁక భూలోక నివాసమును వర్జింపవలసినట్లు గోచరించుచున్నదిగదా! దైవమందఱికి సమానుఁడై యొక్కండేగలండనెడి సుజ్ఞానంబుగలిగి దుష్పథప్రేరితంబయిన మతద్వేషభావమును విడిచి సర్వజనులు నైకమత్యంబుగలిగి సన్మార్గంబునఁ బ్రవర్తించు టెప్పటికి గలుగునో గదా! అకటా! ఇఁక నే నెట్లు సహింపఁగలను?

సీ. సర్వసౌందర్యస♦త్సౌధరాజంబులు
భస్మావశేషరూ♦పముల నుండె
సస్యశోభితదివ్య♦సర్వంసహాస్థలి
నిష్ప్రయోజనగతి ♦ నెగడుచుండెఁ
బ్రాణబాంధవశూన్య ♦ బహుదుఃఖమగ్నమై
కాంతాసమూహంబు ♦ కనలుచుండె
సనుకులసంచారి♦తాంగనాశూన్యులై
యేకపత్నీవ్రతు ♦ లేడ్పుచుండి

గీ. రకట! తలిదండ్రులను బాసి ♦ యమితఖేద
జలధిలోమున్గి శిశువులు ♦ చెలఁగుచుండ్రి
ప్రేమతోఁ బెంచికొనుచున్న ♦ పిల్లలఁ జెడి
పట్టి తలిదండ్రు లెంతయుఁ ♦ దిట్టుచుండ్రి. 132

మఱియు జరుగుచుండిన యెన్నియో విపరీతంబులఁ గాంచినకొలంది యెట్టికఠిన శిలాహృదయంబులయిన శకలీభూతంబులు గాకుండునా? హా! మాధవా! వినరాని విపరీతంబుల వినఁజేయుటయగాక కనరాని కష్టముల సైతము కంటంబెట్టుచుంటివా? అకటా! సర్వజీవుల కొక్కండవే దైవంబవయ్యు నీమతద్వేషంబులఁ గల్పించి యీ యకృత్యంబుల నేల చేయించెదవు? గుణరాజంబైన యైకమత్యముం బోఁ ద్రోలి యీ ద్వేషకూపంబున ముంచి యల్పకాలములోనే నశింపంజేసెదవా? కట కటా! ఈదుస్సహాక్లేశ బడబానలమునుండి యతిక్రమించుటెట్లు?

సీ. భూలోకవాసదు♦ర్బుద్ధి నశించె నన్
నీదు సన్నిధిఁ జేర్పు ♦ నీరజాక్ష!
దారాగతప్రేమ ♦ తరలెను నను నీదు
చెంతను జేర్పుమో ♦ శ్రీరమేశ!
పుత్రానుమోదంబు ♦ మూలనాశన మయ్యె
నన్ను నీదరిఁ జేర్పు ♦ నాగశయన!
ధనకాంక్ష లేశమై♦నను లేదు నన్ను నీ
చరణసన్నిధిఁ జేర్పు ♦ పరమపురుష!

గీ. శుద్ధపాషండ కృతచర్య ♦ జూడఁజాల
ముక్తినొసఁగుము వేగ మో ♦ మురవిరోధి!
నాదు దేహంపు బలమెల్ల ♦ నాశమొందె
నన్ను దయఁజూడు శ్రీజగ♦న్నాథ! దేవ!! 133

శిష్యులారా !

శిష్యు—గురుచంద్రా ! ఏమిసెలవు ?

**తుకా**—ఇంతటితో నాకిహలోక సంబంధ మంతయుఁ దీఱె నేనిఁక శ్రీహరి సన్నిధానంబున కేఁగెదను. కనుక రాఁదలంచెనేని త్వరగా రమ్మని నాయర్ధాంగికిఁ దెల్పి రం'డు.

శిష్యు—చిత్తము. (నిష్క్రమించెదరు.)

**తుకా**—ఓహో! అవసానకాల మాసన్నమైనటుల నాశరీర పటుత్వ మెల్లఁ గ్రమక్రమముగా నశించుచున్నది. నాకిపుడు కర్తవ్య మేద్ది ? (ఆలోచించి)

గీ. జెమునియాజ్ఞను గింకరుల్ ♦ ాపులకును
బ్రాణవాయువు లంగముల్ ♦ బాపునట్టి
యంత్యమున కెట్టి మతి వారి ♦ నాశ్రయించి
యుండునో యది గతిగను ♦ నొప్పును గద. 134

కాఁబట్టి నాయిష్టదైవనామస్మరణ ప్రార్థనములకన్న నింకేమిగలదు ?

మ. కరుణోపేతమనోజ్ఞ ! భక్తజనర♦క్ష ప్రాభవాధీన ! భా
సుర హేమాంబర ! నీలదేహ ! వరదా ♦ సూర్యాబ్జనేత్రద్వయా
పురహారాతహ్రిముఖార్చితాంఘ్రియుగళా ♦ పుష్పేషుపుత్రా! రమా
వర! చక్రీ! మధుసూదనా! గిరిధరా! ♦ పాలింపు నన్గారవిమ్‌. 135

శిష్యు—(ప్రవేశించి) గురుశేఖరా! భవదాజ్ఞానుసార మేఁగి వచ్చితిమి. "గర్భిణీభారాలసనైన నే నెట్లు నాథునితో రాఁగల" నని, అమ్మగారానతిచ్చిరి.

**తుకా**—అటులనా ? సరే !

క. గతజన్మకర్మశేషో
ద్గతజీవుల కదియగాక ♦ కలుగునె యన్యం

బతులితమై యెప్పుడి స
ద్గతియుపదేశములనైనఁ ♦ దథ్యం బరయున్. 136

[కొందఱుభక్తులు ప్రవేశించెదరు.]

తుకా—(సంతోషముతో) మత్ప్రాణబాంధవసదృశభక్తవర్గ మరు
దెంచెనా? అయిన వినుఁడు.

గీ. అమరపురి కేను జనుచుంటి ♦ నార్యులార !
మరల మిముఁజూడఁ జాల నో ♦ మాన్యులార !
పూర్ణ భక్తిని దిరుగుఁ డో ♦ పూజ్యులార !
తలఁపుచుండుఁడు దేవు నో ♦ ధన్యులార ! 137

మఱియు,

సీ. అజ్ఞానియైన నా ♦ యర్ధాంగి సుతులతో
మెలఁగుచునుండునో ♦ మిత్రులార !
గృహకార్యచాతుర్య ♦ మహిమ నేరనియట్టి
యతిముగ్ధభావయో ♦ యాప్తులార !
మృదుమధురముగల్గి ♦ మించుమాటలఁబల్కఁ
జాలనిగోలయోః ♦ సభ్యులార !
ఎన్నియోవిధముల ♦ నే నామెఋణమున
బద్ధుండనైతినో ♦ భక్తులార !

గీ. అన్నివిషయంబులను నాత్మ ♦ సరసి మీర
లాదరింపుచు సుతులతో ♦ నామె కెట్టి
కష్టములు చేరరాకుండఁ ♦ గావుడయ్యా !
యిపుడె శ్రీనాథు దరికి నే ♦ నేఁగుచుంటి. 138

[రామదాసస్వామి సహితముగా శివాజీ ప్రవేశించును.]

శివా—(నమస్కరించి విచారముతో) మహానుభావా! మామూలుగా
మీ యుపదేశ విశేషములకై వచ్చుచు మీ మనస్సంకల్పంబు

వినినంత నే మిన్ను విఱిగి మీఁద బడినట్లయ్యెను. అయ్యో!
పుణ్యాత్మా! ఇంతలోనే కాల మాసన్నమయ్యెనా?

సీ. అజ్ఞానసంఘమున్ ♦ సుజ్ఞానులను నెక్క
భాతి నీపైఁ దేల్చు♦వార లెవరు?
ధనహీన సమితిని ♦ ధారుణీధవు నెక్క
వరుస నీపైఁ జూచు♦వార లెవరు?
మితిలేనిరత్నముల్ ♦ మృత్తికయును నొక్క
ఫక్కి నీపైఁ గాంచు♦వార లెవరు?
సర్వంబు దనతోడ ♦ సాటిజేయుచు నొక్క
తీరు నీపైఁ గను♦వార లెవరు?

గీ. సర్వవేళలయందు ని♦శ్చలత గల్గు
చిత్తవృత్తిని యలసర♦సిజనేత్రు
పాదపద్మంబు లందున ♦ భక్తితోడ
వసుధ నీపైని దిరిగెడి♦వార లెవరు? 139

తుకా—(నవ్వుచు) రాజేంద్రా! ఇది సంతోషసమయముగాని విచార
తరుణము గాదు. కనుక నావచనములు శ్రద్ధతో వినుము.

శివా—మహాత్మా! భక్తితో వినెద వచింపుఁడు.

తుకా—రాజేంద్రా!

సీ. దుష్టపామరుల ♦ దుండగంబులవల్ల
గురుతర పాపంబు ♦ పెరుగుచుండెఁ
బరిమితిలేని త ♦ త్పాపభారంబును
మోయఁజాలని భూమి ♦ ముదము జెంద
రామావతారుఁడై ♦ రామదాసస్వామి
బోధనసాహాయ్య ♦ మొదవగుచు

చంచరింపఁగ నీవు ♦ చాలినవాఁడవు
కావునఁ దప్పు కీ ♦ క్రమము నెపుడు
గీ. అబ్జనాభుం డొసంగిన ♦ యాయువెల్లఁ
దఱిగి సురపురిఁ జేర నేఁ ♦ దరలుచుంటి
సర్వకారణ కర్తయౌ ♦ సారసాక్షు
చింతతోడను మెలఁగఁ బ్రా♦ర్థింతు మిమ్ము. 140

(నమస్కరించును.)

శివా—మహాత్మా! తమయాజ్ఞ దైవాజ్ఞవలె భావించి శిరసావహించితిని.

రామ—ఓ మృదుమధురసంభాషణా! భక్తజనశిరోభూషణా!!

మ. గజరాడ్వాయుజముఖ్యభక్తవరసం♦కాశప్రభావుండవై
సుజనానీకమహానుతిప్రకరసం♦శోభామహాత్ముండవై
ద్విజవాహాంఘ్రియుగాంబుజాతగతహృ♦ద్భృంగప్రధాముండవై
ద్విజమాత్రున్ ననుఁ బెద్దఁజేసి పలుకన్ ♦ విశ్వంబు మన్నించునే?

[రామేశ్వరభట్టు శిష్యయుతముగాఁ బ్రవేశించి.]

మ. అకలంకాత్మక! మమ్ములన్విడిచి నీ ♦ వాస్వర్గముం జేరఁ బూ
నికతోనుండు టెఱింగినట్టి మనుజా♦నీకంబుచే విన్న మే
మిఁక నేరీతి ధరంజరింపఁగల మా ♦ నివ్వేళ నీవెంటఁ దా
వకభక్తవ్రజమైన మమ్ముఁ గొనిపో♦వం జూడుమా ప్రేమతోన్.

[శిష్యసహితముగా మాస్వాజి ప్రవేశించి.]

మ. కరుణాపూరితమానసాబ్జ! హరిభ♦క్తవ్రాతసేవాపరా!
సిరికాంతాధవపాద సత్కమల దా♦సీభూతచిత్తా! మహా
దురితోదారవిదూరచారుగుణ! స♦ద్రూపా! మమున్బాసి నీ
వరుగఁగా మదినెంచినాఁడవుగదే ♦ యాదేవలోకంబుకున్. 143

తుకా—భక్తవరులారా! ప్రాకృత జనులఁబోలి మీర లిట్లు విచారింపఁదగునా? నిర్విచారులై పరమానంద చిత్తంబులతోఁ శ్రీహరి భజనఁ గావింపుఁడు.

అందఱు—(నిశ్చలముగా హరిస్మరణఁ జేయుచుందురు.)

తుకా—(సంతోషముతో) ఓ పుణ్యాత్ములారా! ఓ దయామయులారా! ఓ భక్తశిఖామణులారా! ఓ మిత్రులారా! ఓ బంధువులారా! ఓ సర్వోత్తములారా! అదిగో శ్రీహరికరుణతోఁ బంపినవిమానము వచ్చినది. నేనిదే జనుచుంటిని.

(విమానమెక్కి నిష్క్రమించును.)

అందఱు—(కరతాళధ్వనులొనర్చుచు మహాభక్తివశులై హరినామ సంకీర్తన మొనర్తురు.)

శివా—గురువరా! రామదాసస్వామీ! మన మింక నిట్లు సశరీరముగా స్వర్గ మేఁగినవానిఁ జూడఁజాలముగదా! ఓహో! ఎంతటి పుణ్యశీలుఁడు. ఈమహాత్ముని సత్కారవిషయంబున నేనెన్నిసారులు సంకల్పించినను గొనసాగినది కాదుగదా! అయ్యో! నిశ్చలాత్మా! ఒకతృణప్రాయమైన సాధనమును స్వీకరించి ననుఁ బవిత్రింపఁ జేయవైతివిక దా! (నిట్టూర్పు విడుచుచు ఖేదించును.)

రామ—(నవ్వుచు) రాజేంద్రా! శుద్ధమనస్కుల కిదియా కర్తవ్యము? మితిలేని యాశాపాశబద్ధులై చరించెద రేగాని యాచంద్రార్కముండు వారెవరు? సత్కర్మతోఁ గాలము వెళ్ళించెదమేని మనకందఱ కదియే శాశ్వతము. ఇంతటితో నీప్రకృతిచాంచల్యమునుంచి మరలి యుచితకర్మాభిమానము గలవాఁడవు కమ్ము.

శివా—గురుశేఖరా! ఆమహాత్మునికి నాయందుఁగల ఋణము తీర్చుటకుఁగా నతని కుటుంబరక్షణార్థము నే నిదివఱకు సంకల్పించి

స్న పరిశారము నాలుగు గ్రామను లర్పించు చున్నాడను. (పత్రానువ్రాసి) ఓభక్తజనులారా! మీరలీ శాసనమును, తుకారాముని ధర్మపత్ని కొసంగి సపుత్రపౌత్రాదికముగా నాచంద్రార్క మనుభవింపుమనుఁడు. (పత్రానిచ్చెను.)

భక్తులు—చిత్తము (పత్రాను బుచ్చికొని యామెకిచ్చుట కేఁగుదురు.)

శామ—(సంతోషముతో) రాజచంద్రా! మంచిపనిఁ జేసితివి. ఏ మంటివేని;

క. అనుపమగౌరవ ముఖ్యతఁ
గనుచుండిన వేదభావ ♦ కర్మములందలివర్ణ
దన యర్ధాంగిగర్భం
బునఁదానే పుత్రుఁడౌచుఁ ♦ బుట్టునుగాదే? 143

అట్టి పరమధర్మమును బట్టి యా తుకారాము తేజోద్భూతులైన తత్పౌత్రు లనుభవించుటయు నతని యనుభవముగానె భావింపనగును. అన్నియుఁ జక్కనైనవి. ఆయన పిట్లగుఁగాక.

—♦ భరతవాక్యము. ♦—

చ. సకలజన ప్రకాండమును ♦ సంతతనిర్మల భక్తియుక్తమై
ప్రకటితమార్గమై, హరికృ ♦ పందగఁగాంచునుగాక, యర్థికా
తుకములుదీఱునట్లు దయ ♦ తోడన్నృపుల్ జరియింతురిగాక, భూ
మికరము నిండుపంటలను ♦ మించిచెలంగును గాక సర్వదా. 144

శ్రీమత్ప్రభాకరార్పణమస్తు.

సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.





అనెడి నైదంకముల నాటకము.

మృదుమధుర పదపూరితము, శృంగార విచార రౌద్ర

హాస్య భక్తిరస భరితము

వెల రు 1—0—0

గీ. ఏరుడు సతము విరక్తుండై ♦ వలలు నేసి
కాంత కేటక బహ్వాలం ♦ కార సరణి
ఏరుడు సతము విరక్తుండై ♦ వలలు నేసి
కాంత కేటక బహ్వాలం ♦ కార సరణి.

సీ. కాలత్రియానేక ♦ గణ్యాయ పుణ్యాయ
భర్మాంబరాయ తు♦భ్యం నమోస్తు
నిగమాంత వేద్యాయ ♦ నిత్యసంతోషాయ
వారిజాక్షాయ తు♦భ్యం నమోస్తు
రక్షితలోకాయ ♦ రవిచంద్ర నేత్రాయ
హర సేవితాయ తు♦భ్యం నమోస్తు
శ్రితదత్త కామ్యాయ ♦ శ్రీజగన్నాథాయ
భాసురాంగాయ తు♦భ్యం నమోస్తు

గీ. దివ్యరూపాయ వంద్యాయ ♦ తే నమోస్తు
దివిజ సక్తాయ నుత్యాయ ♦ తే నమోస్తు
దీనజనకాయ నిత్యాయ ♦ తే నమోస్తు
దేవదేవాయ సత్యాయ ♦ తే నమోస్తు.

వలయువారీ దిగువ విలాసమునకు వ్రాయుడు.

**ఉసిరిక బంగారయ్య అండ్ సన్స్,**

బుక్ సెల్లర్స్, కాకినాడ.